# Moodu Shatakalu

* Soundarya Lahari *
* Sakala Kalyani *
* Ananda Lahari *

By Sri Rama Krishna Bharadwaja





# మూడు శతకాలు

## సౌందర్యలహరి • సకల కల్యాణి • ఆనందలహరి



**శ్రీ రామకృష్ణ భరద్వాజ**

శ్రీ

శ్రీ మాత్రే నమః

# మూడు శతకాలు

## సౌందర్యలహరి
## సకల కళ్యాణి
## ఆనందలహరి


శ్రీరామకృష్ణ భరద్వాజ

(కీ.శే. వఝ శ్రీరామకృష్ణమూర్తి)

(1918 - 1986)

మూడు శతకాలు
- సౌందర్య లహరి శతకం
- సకల కల్యాణి శతకం
- ఆనంద లహరి శతకం

రచన : శ్రీ రామకృష్ణ భరద్వాజ
(కీ॥శే॥ వఝ శ్రీరామ కృష్ణమూర్తి గారు)

ప్రథమ ముద్రణ: ఫిబ్రవరి 2008
ప్రతులు : 1,000

ముద్రణ :
మహతి ప్రింట్ క్రియేషన్స్, హైదరాబాద్

ప్రచురణ, ప్రతులకు :
వఝ సీతారామశర్మ (కమలాకాంత్)
సి.303, రుణ్వాల్ ఎస్టేట్, లాకిం కంపెనీ దగ్గర
గోడ్‌బందర్ రోడ్డు, థానే (వెస్ట్) - 400 607 (మహారాష్ట్ర)

రూ॥ 30/-



రచయిత
**శ్రీ రామకృష్ణ భరద్వాజ**
(కీ॥శే॥ వరుఖ శ్రీరామ కృష్ణమూర్తి గారు)

రచయిత ధర్మపత్ని
**కీ॥శే॥ వరుఖ (కస్తూరి)**
**నాగపూర్ణాంబ**

శ్రీ

శ్రీమాత్రే నమః

# ఒక్కమాట...

శ్రీశంకర భగవత్పూజ్యపాదులు రచించిన 'సౌందర్యలహరి' పెక్కు దేవీతత్వ మంత్ర శాస్త్ర రహస్యములతో కూడినదై జనసామాన్యమునకు విశదముగా లేనందున, సంస్కృత, ఆంగ్లములలో ఎన్నో వ్యాఖ్యలు వచ్చినవి. అవి కొన్ని అముద్రితములు, అలభ్యములు, అధిక మూల్యములు.

ఆంధ్రభాషలో సౌందర్యలహరిని ఆంధ్రపద్యరూపముగ కొందరు కవులు రచించియున్నారు. మాతండ్రిగారు కీ॥శే॥ వడ్లు శ్రీరామకృష్ణమూర్తిగారు శ్రీ కనకదుర్గామహాతల్లి అనుగ్రహముతో శ్రీ సౌందర్యలహరిని ఆంధ్రభాషలో పద్యరూపముగ రచించియున్నారు.

దుస్తరమైన సంసార సాగరమున మగ్నులగు జనులను రక్షింప, పరమేశ్వరావతారభూతులును, బ్రహ్మసూత్ర, భగవద్గీతాది మహావేదాంత గ్రంథ భాష్యకారులునునగు పూజ్య శ్రీమచ్ఛంకర భగవత్పాదులు, ఈశ్వర మహిమాశాలినియగు అంబికను స్తోత్రముచేయగోరి, మంత్రశాస్త్ర తత్త్వభరితమును, దేవీ స్వరూప వర్ణనాత్మకమును నగు 'సౌందర్యలహరి' యను శతశ్లోకిని రచించినారు. ఈగ్రంథము కేవలము పరదేవతా తత్త్వమును విశదపరచునదియే గాక, శాక్త మంత్రోద్ధారకక్రమమును విశదీకరించునదికూడ.

శ్రీశంకరభగవత్పూజ్యపాదులు దేవీ కటాక్షమున సర్వజ్ఞులై మహాకవితా వైభవము పొంది మహావేదాంత గ్రంథభాష్యములనేగాక అసంఖ్యాకముఖ్య దేవతా స్తోత్రాదికములను తన అల్పాయుష్కాలముననే రచించినారు.

షణ్మతస్థాపకులై శారదాపీఠములను యావద్భారతమున స్థాపించి తిరిగి కైలాసమున కరుదెంచిన పరమ శివమూర్తులు.

శ్రీసౌందర్యలహరిలోని నూరు శ్లోకములలోని మొదటి నలుబది యొక్క శ్లోకములుగల భాగమును ఆనందో(బ్రహ్మేయను శృతి ననుసరించి దేవీరహస్య తత్త్వానందమును తెలుపునది గావున ఆభాగమును ఆనంద లహరి అనియు, తక్కిన యాభై తొమ్మిది శ్లోకములుగల భాగమును దేవీ సౌందర్య దివ్యాభివర్ణనప్రవాహము గావున సౌందర్యలహరియనియు రెండును రెండు ప్రత్యేక భాగములుగ ఉత్తర భారతమున వ్యవహరించు చున్నా, దక్షిణభారతమున సౌందర్యలహరి శతశ్లోకియైన యొకే గ్రంథముగ పరిగణింపబడుతున్నది.

ఈ 'సౌందర్యలహరి' పద్య అనువాదము సరళముగను, క్లుప్తముగను ఉండినది. ఈ చిన్ని పుస్తకము శ్రీదేవీభక్తులకు మిక్కిలి సమాదరణీయమై, అందరి మన్ననలను పొంది, మా నాన్నగారి ఆత్మశాంతికి దోహదమవు తుందని ఆశిస్తున్నాను.

శ్రీకృష్ణాతటినీతట విరాజమాన విజయవాడ నగరశిఖరాయమాణ శ్రీమదింద్రకీలాద్రి నధిష్ఠించియున్న శ్రీకనకదుర్గామహాతల్లి సకల జనులకు, శ్రీదేవీ భక్తులకు చిరాయురారోగ్య భాగ్యముల నొసంగి కీ॥శే॥ శ్రీ రామ కృష్ణ మూర్తిగారి ఆత్మకు శాంతిని కలిగించుగాక.

ఇట్లు
విధేయుడు
వఝ సీతారామశర్మ
(కమలాకాంత్)

థానె (వెస్ట్), ముంబాయి
14.01.08

# నా మాట...

మా నాన్న గారు కీ॥శే॥ వఝ శ్రీరామకృష్ణమూర్తి గారు చిన్నతనం నుండీ శ్రీరామకృష్ణ పరమహంసవారి బోధనలను అధ్యయనం చేసి, వారిని ఆదర్శప్రాయంగా చేసికొని ఉత్తమ సంస్కారాలతో జీవనం సాగించిన మహోన్నత వ్యక్తి.

మా అమ్మగారు మా నాన్నగారి జీవితంలో కష్టసుఖాలను సమతుల్యంగా పంచుకుని, ఆయనకు చేదోడు వాదోడుగా నిలిచిన ఆదర్శమూర్తి, పరమసాధ్వి, మహోన్నతమైన ఇల్లాలు.

1976 ఆగస్టులో మా అమ్మగారి అకాల మరణంతో మానసికంగా కృంగిపోయిన మా నాన్నగారు ఆ జగజ్జననిని శరణుకోర్చి ఆమె కటాక్షం పొందినారు. ఆమె కరుణా కటాక్షాలతో తన హృదయాంతరాళంలోంచి వెల్లువెత్తిన భావావేశానికి శాశ్వతతను చేకూర్చిన అక్షర సాకారమే యీ మూడు శతకాలు.

ఆయన జీవన కాలంలో ఈ పద్య కావ్యాలను ముద్రితంగా చూసుకోలేకపోయారు. ఇన్నాళ్లకి ఆ జగన్మాత కటాక్షంతో ఈ మూడు శతకాల వ్రాతప్రతులను అనధికారిని, అల్పజ్ఞుడనైన నేను, సంస్కరించి ప్రచురణకు పూనుకున్నాను. వీటిని చదివిన సామాన్యులు గూడ దేవీ పూర్ణానుగ్రహ ప్రాప్తులు కాగలరని నా నమ్మకం.

ఈ మూడు శతకములు శ్రీ శృంగేరి శారద, శ్రీకనకదుర్గాంబ, శ్రీ బాసర సరస్వతీమాతలకు అంకితము నొందుట కనుగ్రహించినందులకు ఆ పరాశక్తికి అనేక కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

ఈ శతకముల ప్రచురణకు నన్ను ప్రోత్సహించి, తమ సహాయ సహకారముల నందజేసిన మా బావగార్లు శ్రీ దిగుమర్తి రాందాస్‌గారు, శ్రీ గిడుగు వేంకట రామకృష్ణారావుగార్లకు, యీ మూడు శతకాలను అడిగినదే తడవుగా ఎంతో అభిమానంతో అభిప్రాయం రాసి యిచ్చిన సుప్రసిద్ధ పరిశోధకులు, పేరొందిన సృజనాత్మక రచయిత, కథకులు అయిన డా॥ అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ) పి.హెచ్.డి. గారికి ఈ మూడు శతకాల ముద్రణలో తమ అమూల్య సలహాలనిచ్చి అనతికాలంలోనే ముద్రించి యిచ్చిన మహతి ప్రింట్ క్రియేషన్స్ వారికి, నాన్న శతకాలను ముద్రణ చేయిస్తున్నానని చెప్పగానే సంతోషించి, ఒక్క తమ్ముడయిన మా బాబాయిగారు శ్రీ వఝ వెంకట కామేశ్వరరావు (ఏలూరు) గార్కి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

వీరందరికీ, దేవీభక్తులగు పాఠకులకు ఆ పరాశక్తి, శ్రీ కనకదుర్గామతల్లి పుత్ర వాత్సల్యంతో చిరాయురారోగ్య భాగ్య నిఖిలాభ్యుదయ నిశ్రేయసములొసగి కరుణించవలసినదిగా కోరుకుంటున్నాను.

విధేయుడు

థాణె (వెస్ట్), ముంబాయి
14.01.08

**వఝ సీతారామశర్మ(కమలాకాంత్)**

# దుర్గా త్రిశతి

సాధారణంగా లోకంలో పిల్లలు తల్లి దగ్గరే ఎక్కువ చనువు, మాలిమి, అభయం, ఆనందం కలిగి ఉంటారు. ఏదైనా పొరపాటు పని చేసినప్పుడు, తప్పు జరిగినప్పుడు తండ్రి కోపం తెచ్చుకున్నా తల్లి ప్రేమగా బుజ్జగించి చెపుతుందే కాని కోపం తెచ్చుకోదు. తండ్రి కోపం నుంచి కూడా కాపాడుతుంది. లోకంలో 'నాకు ఏ శాస్త్రమూ వద్దు. ఏ పాండిత్యాలూ అక్కర లేదు. నాకు తెలిసిందల్లా ఒక్క అమ్మే! ఆమె దయ ఉంటే అన్నీ ఉన్నట్లే' అన్నారు రామకృష్ణ పరమహంస.

జ్ఞానం తండ్రి వంటిదైతే, భక్తి తల్లివంటిది అని కూడా చెప్పారు శ్రీ రామకృష్ణ పరమహంస. దుష్కర్మ ఫలాన్ని కూడా తొలగించి వేస్తుంది తల్లి. ఇప్పుడీ మూడు శతకాలలో కైలాసవాసి శ్రీరామకృష్ణ భరద్వాజగారు తల్లి దయను, కరుణను, ప్రేమను, ఆదరాన్ని, అభిమానాన్ని పదే పదే తలచుకొని సమాశ్వాసం పొందారు. చొక్కిపోయినారు. అమ్మా! నీ కరుణాకటాక్ష వీక్షణం ఒక్కటి చాలు, భవబంధాలన్నింటినీ తొలగించడానికి అని ఆర్తితో విన్నవించుకున్నారు. భక్తిభావ తాదాత్మ్యంతో, శరణాగతితో, ఆర్తితో శ్రీమాతను స్తుతించారు. ఇటువంటి స్తోత్ర అరచనలకు, హృదయా రాధనకు, ఆత్మ సమర్పణకు చిన్నచిన్న పద్యాలే అందంగా ఉంటాయనిపిస్తుంది. విశేష వృత్తాలు, సమాస గుంఫనలు, పద్యాలను దౌడు తీయించటాలు రచయిత పాండిత్య ప్రదర్శకాలు కావచ్చునేమో కాని, భక్తి భావబంధురాలు అయిన చిన్న పద్యాలు లాగా భరన్యాస అనుభూతిప్రదం కావేమో ననిపిస్తుంది. కృష్ణశతకం, సుమతీ శతకం, వేమనశతకం తెలుగు పిల్లలకు దగ్గరైనట్లు వృషాధిప, భాస్కర, కాళహస్తి శతకాలవంటివి కంఠోపాఠం చేయడం కష్టం కదా పిల్లలకు. ఇప్పుడీ మూడు శతకాలలో శ్రీ రామకృష్ణ భరద్వాజగారి శిశుసారళ్య ప్రవృత్తి, తల్లి పాదాబ్జాలపట్ల లాలిత్య ప్రతిపత్తి (ఆమె లలిత కదా!) శ్రీవైష్ణవ ప్రపత్తి ఆసాంతం విస్తరించి కనపడుతున్నాయి. అట్లా అని వారికి శ్రీవిద్యా సంప్రదాయంలో గాఢమైన పరిచయం సందేహించనక్కర లేదు. కాళిదాసు, మూకకవి శ్రీ విద్యాపారంగతులా కవులు కాకముందు? "ఏ వేదమ్ము పఠించె, ఏ శాస్త్రముల్ చదివె, ఏ మంత్రమూ హించె" అని ముగ్ధభక్తులను మెచ్చుకున్నాడు కదా ధూర్జటి మహాకవి.

లలితా సహస్రనామం, సౌందర్యలహరి, ఇంకా దేవీస్తోత్రాలలోని మహా మంత్రాలు ఈ చిన్న శతకాలలో అందమైన పద్యాలుగా వొదిగిపోయినాయి. మనసు కోవెల

(50వపుట). శంఖమోంకారము (50) శోభ నర్తించుచుండు సుషమ్న (53) సకలచ్ఛందస్సుధాసార (55) పాదమంజీర రవళీ ప్రమోద శుభద మందగమనవు (42). మందస్మితేందుముఖివి (42) వంటి చాలా అందమైన పదాలు, పద బంధాలూ ఈ శతకాలలో కనపడతాయి. 'ఇడా పింగళ మధ్యస్థా సుషుమ్నా తంతు రూపిణీ', 'భవానీ భావనా గమ్యా', 'భావారణ్య కుఠారికా', 'సర్వారుణా నవదోంగీ సర్వాభరణ భూషితా' వంటి శ్లోకాలు మల్లెపూల ప్రోవులవంటి మాటలలో ఈ శతకాలలో తెలుగు మంత్రాలుగా రూపొందాయి. శ్రీ రామకృష్ణ భరద్వాజగారి దివ్యస్మృతికిదే నా నమస్కారము. ఈ శతక సంకలనాన్ని ఎంతో భక్తి ప్రపత్తులతో ప్రకటిస్తున్న సోదరులు శ్రీ సీతారామశర్మగారికి, వారితోబుట్టువులకూ నా శుభాభినందనలు. 'కళాత్మికా కళానాథా కావ్యాలాప వినోదినీ' అన్న స్తుతికి అనుగుణంగా తల్లికి వినోదం చేకూర్చిన శ్రీ రామకృష్ణభరద్వాజగారు ఇహపరాలలోనూ ధన్యులు.

ఒక ఆధ్యాత్మికవేత్త ఇట్లా అన్నారు.

In the west God the Father is prominent while in the East, in India especially, God the Mother comes First. When we approach God the Father we feel His wisdom, His inner light and His vastness. When we approach God the Mother we feel infinite love, infinite compassion and infinite concern (P-151) Indian spiritual Gurus. (Twentieth Century - H.L. Ahuja, 2006).

అని విన్నవిస్తూ...

– అక్కిరాజు రమాపతిరావు

హైదరాబాద్
14.01.08 (మకరసంక్రాంతి)

శ్రీ

శ్రీ మాత్రే నమః

# సౌందర్యలహరి

కృతి సమర్పణము

శ్రీ శృంగేరి శారదాంబ పూజ్య పాదారవిందములందు

భక్తితో సమర్పితము

**శ్రీరామకృష్ణ భరద్వాజ**

ఏప్రిల్ 1977

(కీ.శే. వరుఖ శ్రీరామకృష్ణమూర్తి)

(1918 - 1986)

శ్రీ

శ్రీమాత్రేనమః

సమయ మత తత్వవేత్తయయిన శ్రీశంకర భగవత్పూజ్య పాదులు సమయయను చంద్ర కళను నూరు శ్లోకములచే ప్రస్తుతించుచున్నారు. అందు మొదటి 41 శ్లోకములు 'ఆనందలహరి'.

అవతారిక : శక్తియొక్క మహిమను గూర్చి చెప్పబడుతున్నది.

1. శక్తి నిను గూడ, శివుడంత। శక్తుడగును
సృష్టి స్థితియును, లయమును। జూచి చేయ
నీవు లేకున్న, శివుడేని। నిశ్చలుండు
చలనమందదు, శివుడైన। శక్తిలేక॥

అవతారిక : భగవతీ పాదరేణు మహిమ

2. నీదు, పదపద్మ రజములు। నెమ్మిచేత
బ్రహ్మ సృష్టించు, లోకాలు। బహుళములుగ
హరి, నిలుపువాని ప్రళయంబు। వరకు కూర్మి
ప్రళయమొందించ హరు చేరు। భస్మవిధిని॥

అవతారిక : శక్తి పాదరేణు మహిమ.

3. తేజ మెదనిండి, అజ్ఞాన। తిమిర మడచు
జడుల యందున, చైతన్య। ఝరియె యౌను
దీనజనులకు, భాగ్యంపు। దివ్యమణియు
జన్మజలధిని, నావయై। జనని తనరు॥

అవతారిక : పరాశక్తియొక్క చరణములే అభయవర ప్రదాన సమర్థములు.

4. అభయ ముద్రలు, దేవత। లభినయింత్రు
అభినయమె, లేదు నీహస్త। ముభయములను

అంత, నీచరణ యుగ్మమే। చింతదీర్చి
యెపుదు, భక్తుల కాపాడ। నిపుణమౌను॥

అవతారిక : సోదాహరణముగ పరాశక్తి మహిమ.

5. పంచె, మధువును నిన్ను, సే।వించి హరియు
ముంచితివి, శివుని చిత్తంబు। మోహమునను
స్మరుడు, రాజిల్లె, నీపూజ। సలుపుకొనుచు
రతియు, మునులును, మోహాన। రగులుకొనగ॥

అవతారిక : దేవీ కృపాకటాక్షమున మన్మథుదు మహామహిమనొందుట.

6. పద్మములు, ధనువు, మౌర్వియో। భ్రమరతతులు
రథము, మరుతంబు, మంత్రియై। ఋతువుగాగ
పంచ విశిఖాలుగా, పూలు। పంచ శరున
కైన, నీదయయుంటచే। యగును, జయము॥

అవతారిక : నాభిస్థానమందలి మణిపూర చక్రమందలి సమయ అను పరాశక్తి వర్ణనము.

7. వరలు, కుచ భారమున, నడుము। వంగియాడ
కాంచి మ్రోయంగ, పుష్పాలు। కరములాడ
పూర్ణశక్తి బింబమై, హరుని। పూతశక్తి
మించి, మణిపూర దర్శన। మిచ్చుగాక॥

అవతారిక : హృదయస్థానమందలి అనాహిత చక్రమందలి సమయ అను భగవతి స్తుతి

8. అమృత వార్నిధి, కల్పవృక్షాల వాటి
మణుల దీవిని, నీ, పోప। వనమునందు
మణి గృహంబున, శివుడను। మంచ మందు
పరమశివు జేరు, లలిత రూ। పంబుదలతు॥

అవతారిక : కుండలిని (శక్తి) సహస్రార చక్రమును చేరుట

9. మూలమును వీడి, జలములఁ దేలియాడి
అగ్ని జొరబడి, వాయువుఁ నావహించి
ఆకసంబున, విహరించిఁ ఆజ్ఞగడచి
చంద్రకళలందు, నీవుండుఁ చేరి పతిని॥

అవతారిక : కుండలిని (శక్తి) సహస్రారమునుండి మూలాధారమున నిద్రించుట.

10. ఊర్ధ్వ కమలాన, చంద్రునిఁ యొద్ద నిలచి
అమృతధారలు, దారులఁ గ్రుమ్మరించి
నీదు నెలవైన మూలంబుఁ నందుజేరి
వలయ భుజగంబు వలె, నీవుఁ వెలసియుందు॥

అవతారిక : శ్రీచక్రరూప వర్ణనము

11. పద్మముల, చక్ర, బిందుల,ఁ పరగు కోణ
వలయముల, ద్వార, ప్రాకారఁ వర్గములను
మూడు రేఖల, పరిణామఁ మూలమౌచు
తేజ మొప్పును, శ్రీచక్రఁ రాజమందు॥

అవతారిక : పరదేవతాసౌందర్యవర్ణనము.

12. అమరలలనవె, మోహనఁ నమరుకొనగ
నీదు సౌందర్యమును, నెంచఁ నేరితరము?
శివుని సాయుజ్య మందినఁ చెప్పనౌనా?
యనుచు, తపమును, జేతురఁ త్యంత మతిని॥

అవతారిక : భగవతి అపాంగావలోకన మహిమ.

13. అనుపమంబైన, నీ చూపుఁ లందు నిలువ
జడమతినినైన, కామించిఁ ముదులు వీడ

పైట కొంగులు జారంగ। వెంటనంటి
పరుగు లెత్తుదు, రెంతటి। పడతులైన॥

అవతారిక : భగవతి పాదాంబుజమహిమ

14. ఆరుపద్మాల, మున్నూర్ల। ఆరుపదుల
కిరణ జాలంబు, ఆపైన। చంద్రబింబ
మొదవ, నీపాద యుగళియు।నందు చెలగి
చంద్ర, సూర్యాగ్నులిత్తురు। చేరి రశ్మి॥

అవతారిక : పరదేవతను గూర్చిన సారస్వత ధ్యానము

15. శుద్ధ, శరదిందు చంద్రికా। స్ఫూర్తినిండి
కబరి, నెలవంక హస్తాల। నభయవరము,
విద్య, మాలలు, ముద్రలన్। వేద్యమౌచు
నుండు, నీరూపు దలచిన। నిండుకవిత॥

అవతారిక : పరదేవతను గూర్చిన సారస్వత ధ్యానము

16. అరుణకాంతుల, కమలంబు। లలరి నటుల
అరుణయని, నిన్ను, సేవించు। నట్టి కవులు
వాణి ప్రేరణ, గంభీర। వాక్కు లందు
మధురగంభీర, కవితల। మధువునిండు॥

అవతారిక : పరదేవతను గూర్చి సారస్వత ధ్యానము.

17. చంద్రకాంత శిలాధవ। ళేందు ఛాయ
యోగి నీ, సహిత శక్తుల। నొప్పు నిన్ను
ధ్యానమున నిల్ప, పుంభావ। వాణియగుచు
కమలపరిమళ మిళితమౌ। కావ్యమల్లు॥

అవతారిక : భగవతి అరుణకాంతి మహిమ.

18. తరుణ సూర్యునికిరణాల। యరుణిమలను
భువిని ముంచెత్తు దేవిగా। బోల్చ నిన్ను
వేడికన్నుల సొబగుల। వేడికొనుచు
కాళ్లబడుదురు, గీర్వాణ। గణికలెల్ల॥

అవతారిక : కామకళా స్థూలరూపధ్యానము

19. బిందు రూపమ్ముగా, ముఖ। మందుక్రింద
కుచపు ద్వయమును, భావించి। కూర్మివాని
క్రిందిభాగమున, యోని నొ। క్కింత దలచ
వాని వశమగు, ముల్లోక। వనిత లెల్ల॥

అవతారిక : తృతీయకూట మహిమ (విషజ్వర హరము)

20. అమృత కిరణాల, వర్షించు। చంద్రకాంత
శిలన రూపొందు, మూర్తిగా। చేరి కొలువ
సర్పదర్పాల శమియించు। శక్తికలుగు
జ్వరపు బాధలు తొలుగుతా। నరయుచుండ॥

అవతారిక : కామకళయొక్క సూక్ష్మధ్యానము (పరమాహ్లాదకరము)

21. మెరపువలె మించి, సూర్యాగ్ని చంద్రవరుల
నెరపుకొంచును, కమలాల। నెరవుదాటి
కమల వనమున బైందవ। కళను నుండ
హ్లాదలహరిని, చూతు,రా। నందగరిమ॥

అవతారిక : దేవి నామమహిమ

22. నిన్ను స్మరియింప గోరి, భ। వాని యనుచ
నీదు కరుణార్ద్ర దృష్టిని। నిలుపు మనుచ
ఇచ్చు నినువేడ, సాయుజ్య। మిచ్చు గొరకు
ఇత్తు పదముల, తాదాత్మ్య। మింత వేడ్క॥

అవతారిక : దేవి దేహవిశేషవర్ణనము

23. ఫాలనేత్రంబు, శశాంకు కళయునొప్పి
అరుణిమలదేలి, నీవుండు ఆత్మదలతు
హరుని వామార్ధమున, తృప్తి నందలేక
దక్షిణార్ధమునున్, నీవు దాల్చితనుచు॥

అవతారిక : దేవీభ్రూవిలాసమహిమ

24. బ్రహ్మ, విష్ణువు, రుద్రుండు పరగ, నదుపు
విశ్వమవ్వారితో, గూడు విలయమంది
ఈశునందున, నిలచు సర్వేశుడగుట
అతను నీ కృపసాక్షియై అనుసరించు॥

అవతారిక : దేవీ చరణార్చనా మహిమ (ఫలము)

25. మూడు గుణముల, నిల్చిన మూర్తిత్రయము
నీదుపదముల, కాంతుల నెలమియుండ
పరగ వారికి నే, జేయు పాదపూజ
నీకె చెందెదు, ననునది నిక్కువంబు॥

అవతారిక : భగవతీ ప్రభావ మహిమ.

26. హరి విరించులు, మనువులు మరియు యముడు
ధనదుడును, గూడ, విలయాన తనువువీడ
ఆ సదాశివుడొక్కడే ఆశ నీదు
చెంగటను నిల్చు, నీ శక్తి చెలగుకతన॥

అవతారిక : భక్తుడు తన సర్వ కర్మలు దేవియొక్క యారాధనమే యనుట.

27. జపము, మాటలు, చేతులు జరుప ముద్ర
తిరుగుటది యౌను - నీపరిధి తిరిగి నటుల
అశన - మాహుతి, దొర్లుట యగును - మ్రొక్కు
విషయ సుఖములు- పూజలై వెలయుగాక॥

అవతారిక : దేవి తాటంక మహిమ

28. సుధనుగ్రోలియు, ఇంద్రాది। సురలుగూడ
నాశనమునొందు, వారె, ఏ। నాటికైన
కాలకూటంబు ద్రావియు। కనదుచావు
దివ్య మానీదు, తాటంక। దీప్తి శివుడు॥

అవతారిక : దేవి మహిమ - సదాశివుని సర్వోత్కృష్టత

29. నీదుపతి యందు భక్తిని। నెరపుకొనుచు
అతని తోడ్తేరనీ వటు। లరుగువేళ
నీకు మ్రొక్కెదు, దేవతా। నీకమకుట
తతులు, నీపాదముల, కెందు। తగులు నేమొ॥

అవతారిక : దేవీ తాదాత్మ్య, ధ్యానమహిమ

30. నీవె, నేనను, భావంబు। నెమ్మిదలచి
నీదు తాదాత్మ్యమందున। నిలచువాడు
శివుని సంపద, తృణముగా। జేసిజూచు
ప్రళయకాలగ్ని, కైనని। ర్భయత నుండు॥

అవతారిక : పరదేవతా మంత్రము

31. సిద్ధ విద్యల, నెన్నియో। శివుడు వెలువ
రించియును। నీదు మెచ్చికో। లింత లేమి
తలచి, వెలయించె, శివుడు, స్వ। తంత్రతంత్ర
మనుచు, పురుషార్థ ఘటనా,స। మర్థముగను॥

అవతారిక : పరదేవతామంత్ర - లోపాముద్రా విద్యా - శ్రీచక్రవర్ణనము

32. పదియు, ఐదక్షరంబుల। బరగుచుండి
మూడు ఖండాల, 'హ్రీ'మను। ముదులు గలిగి

మూడు గుణములు, శక్తులు। మూలమైన
నీదు నామంబు, భువిక్రమ్మి। నిలచుతల్లి॥

అవతారిక : కామరాజ విద్యావర్ణనము

33. మూడు బీజాక్షరంబుల। ముదులు జేర్చి
నీదు మంత్రాన, నవయంబు। నిలచువాదు
బైందవ స్థాన, మధ్యంబు। నందు నీకు
సురభి ఘృతధార, నాహంతి। గరపుచుండు॥

అవతారిక : పూర్వ కౌలమతమున నవాత్మక విద్యారూప ప్రతిపాదన

34. చంద్ర సూర్యుల స్తనములన్। చెందినీవు
శివుని శారీరవిభవమై। చేరుకతన
నీదునవ వ్యూహశక్తుల। నెలవులన్ని
శివుని యందున సమరసం। బవుచు చెలగు॥

అవతారిక : ఉత్తర కౌలమత ప్రతిపాదన

35. నీదు, చిచ్ఛక్తి రూపాన। ముదముతోడ
విశ్వరూపంపు, తాదాత్మ్య। విభవమంది
శివునియందున, సతతంబు। చెలగునట్టి
విభవమద్దానినెంచెద। వేడ్కతోడ॥

అవతారిక : ఆజ్ఞాచక్రస్థిత దేవతా ద్వంద్వధ్యానము.

36. తపన, శశి, కోటిద్యుతి, తోడ। తనరుచుండి
శివుని భ్రూమధ్య మందున। చేరికొలిచి
పర, మిళితమైన చిచ్ఛక్తి। పరగతేలి
చంద్రకిరణాల, భా, లోక। మందుకొనును॥

అవతారిక : విశుద్ధ చక్రాధిష్ఠాన దేవతాద్వంద్వ ధ్యానము

37. శుద్ధ నిర్మల స్ఫటిక, వి। శుద్ధ ప్రభల
శివ, భవానుల, ధ్యానాన। చేర్చువాని
చంద్రకిరణాలు, మదిలోన। విరిసికొనుచు
అంతరపు, తిమిర సందోహా। మణచివైచు॥

అవతారిక : అనాహత చక్రాధిష్ఠాన దేవతా (పరమ హంస, పరమ హంసాంబా) ధ్యానము.

38. గుణము విడదీసి, దోషంబు నణగ ద్రోయు
పలుకులుగ, అష్టదశవిద్య। పరిణమించు
నట్టి, యాహంస మిధునం, బ। నాహతమున
ఎంచి, మకరందమును గ్రోల। నెంచుచుందు॥

అవతారిక : స్వాధిష్ఠాన చక్రాధిష్ఠాన సంవర్తేశ్వర సమయాంబా ధ్యానము

39. సమయ కళనిండి, హుతవహు। సమయ వొచు
మరల మణిపూర, కమలాన। పరగి నీవు
నీ దయాదృష్టి, చలువల। నింపు చుందు
నట్టి చిత్కళ, స్తుతియింతు। ననవరతము॥

అవతారిక : మణిపూర చక్రస్థిత కామేశ్వర సౌదామిన్యంబా ధ్యానము

40. నీదుమణి పూరమందున। నెరపుకాంతి
లోని తిమిరాల, కాతటి। త్సన్నిభంబు
ఆ సదాశివుకాంతుల। నలమటిలెడు
లోక తపనకు, మేఘమా।లికయెయవును॥

అవతారిక : మూలాధారచక్ర స్థిత సమయాంబా మహా నటేశ్వర ధ్యానము

41. మూలకమలంబు, నందున। మోఘరీతి
శివుని తాండవ, మందున। చేరి నీవు
సమయకళతోడ, లాస్యమం, దమరువేళ
ఆది మిధునంబు నెంతు, న। నన్యమతిని॥

శ్రీః

శ్రీమాత్రే నమః

# సౌందర్యలహరి

నలుబది రెండవ శ్లోకము మొదలు నూఱవ శ్లోకము వరకు.

అవతారిక : పరదేవతా కిరీటవర్ణనము

1. నీదు నికటాన, నవయంబు। నిలువగోరి
గగన మణులంత, మాణిక్య। గణములైరి
నీదు మకుటాన, శశిరేఖ। యందమంద
ఇంద్రధనసేమొ యను భ్రాంతి। ఇంత గలిగె॥

అవతారిక : పరాశక్తి శిరోజ విశిష్టత్వ వర్ణనము

2. కబరిలో నిండి కల్ప, వృక్షాలపూలు
పరిమళాల్నింపు కొనుచును। ప్రభలజెందె
నల్లకలువల బోలుచు। నలరుకురులు
అరయలోనున్న తిమిరాల। నణచుగాక॥

అవతారిక : భగవతి సీమంత వర్ణనము

3. వదనసౌందర్యలహరీ, ప్రవాహమదియె
పాపిటగ రూపుదాల్చుచు। పరగుచుండ
కేశములు చోరులిట్టుల। ముసురుకొనుచు
తిలకబాలార్కకిరణాల। నలముకొనియె॥

అవతారిక : దేవి ముఖవర్ణనము

4. తుమ్మెదలబోలు, కుటిలాల। కములలేలి
పద్మ ప్రభలను, పరిహాస। పరచెమోము
దరహసిత దంత పుష్ప, కే। సరపురుచులు
స్మరహరుని చూపు నిలుపుచు। మరులుగొలిపె॥

అవతారిక : దేవి లలాట వర్ణనము

5. శిరమునన్ తేలెనొక్క, శు। ద్ధేందురేఖ
ఫాల లావణ్య ద్యుతిలోన। ప్రతిఫలించె
అర్ధ చంద్రులనేకాక। నలముకొనుచు
పూర్ణచంద్రుని నీమోము। పుణుకుకొనియె॥

అవతారిక : దేవీ భ్రూ సౌందర్యవర్ణనము

6. నల్లనౌ నేత్రకాంతుల। నారిగట్టి
కనుబొమలు, ధనువుగావంచి। కరముబట్టు
మన్మథుని ధనువుగా నెంచి। మదిని దలతు
భువన భయముల, బోనాడి। బ్రోచుమమ్మ

అవతారిక : నేత్రములచే దేవిని కాలస్వరూపిణిగ వర్ణించుట

7. సవ్య నయనాన, రవియుండ। దివము పరగు
వామనేత్రాన, చంద్రుండు। వరలరాత్రి
దివసనిశి, సంధ్య చెలగ, నీ। దివ్యదృష్టి
కాలరూపిణి మూడవ। కంట నిలిచె॥

అవతారిక : దేవి దృష్టి విశేష వర్ణనము

8. లోకములనేల పెంపనీ। లోన నణచ
అష్టవిధముల, నీచూపు। లలరుచుండె
అష్టశక్తులు నగరాల। ఇష్టనామ
ధేయముల యందు వర్తిల్లి। తేజరిల్లి॥

అవతారిక : దేవీఫాలనేత్రాభివర్ణనము

9. నీదు అకర్ణ నేత్రాల। నిగ్గలందు
మధుపమదిక్రోలంగ। మధురరసము
ఎర్రజీరల మెరయుచు। మిర్రిజూచి
ఫాలనేత్రమొకించుక। పడెను ఈర్ష్య॥

అవతారిక : దేవి సర్వరసాత్మక దృష్టి వర్ణనము.

10. పరము శివునందు చూపు, శృంగారపరము
అన్యులందున, రోష, సా। జన్య, భీత
స్మేర, విస్మయ, విధముల। మెలగుచుండు
కాని నాయందు నీచూపు, ని। క్కంపుకరుణ॥

అవతారిక : దేవీ నేత్రద్వయవర్ణనము

11. పుష్పబాణు శరీరము, నీ। పొందుచేరి
తూపువై నీవు వేధింపుచుండ
పరమశివులోని శాంతి,ని। ప్పచ్చరమ్ము
అతని హృదిలోని, కోరిక। నణచలేక॥

అవతారిక : దేవి నేత్రకజ్జల వర్ణనము

12. మూడు మూర్తులు, విలయాన। ముడిచినపుడు
తిరిగి సృజనంబుగా, జేసి। తేల్చుకొరకు
మూడు గుణములు, రంగుల। ముంచినట్లు
కనులయందున, కజ్జల। కాంతులిమిడె॥

అవతారిక : దేవీ నేత్రములు త్రివేణీ సంగమమని వర్ణనము

13. తెలుపు, నలుపును, ఎరుపును। త్రేజమంది
నీదుమున్నేత్రముల, బారె। నదులుమూడు
గంగ, యమునయు, శోణయున్। గలియుచోట
పాపరహితుల జేసి, కా। పాడుగాక॥

అవతారిక : దేవి అనిమేష వర్ణనము

14. నీదు కన్నులు తెరచిన। నిలచు సృష్టి
తలచి నేత్రాలు మూయంగ। విలయ మందు
నిత్యమై సృష్టి నిలువంగ। నిశ్చయించి
కనులు మూయక యుందు। వీ కరుణ నీవు॥

అవతారిక : దేవి అనిమేష నేత్ర వర్ణనము.

15. రేలు, నీ నేత్ర శోభల। తేలుకలువ
పవలు పరగును నీ, నేత్ర। ప్రభలయందు
నీదు అనిమేషస్థితి, చేప। నేర్చుకొనగ
చెవులు తాకెదు, కన్నులు। చేసెతగవు॥

అవతారిక : దేవీ కరుణాకటాక్షవీక్షణ వర్ణనము

16. వనము, హర్మ్యంబు, నొక్కటి జ్యోత్స్న నింప
తుహిన కరు రశ్మి, యిసుమంత తొలగబోదు
చెలగు నీకంటి, నీలోత్పలాల చలువ
దనుపగా నన్ను, నీకేమి తరుగు తల్లి॥

అవతారిక : దేవీకర్ణపాళీ వర్ణనము

17. శ్రవణముల నాను, నీకంటి చివరలందు
కుసుమ శరు, శరపు చూపులు కూడియుండి
తమ్మె నీయది, కుసుమాస్త్రు ధనువెయౌను
నీయపాంగము, నాయందు నిలచుగాక॥

అవతారిక : దేవీ తాటంక ప్రతిబింబిత ముఖవర్ణనము

18. చంద్ర, సూర్యుల, చక్రాల చందమొదవ
రాక్షసుల దునుమ శర్వుండు రథమునొప్పె
చెవుల, కమ్మల చక్రాలు చేసుకొనుచు
మదనుడిక నీదు, చెక్కిళ్ల రథమునెక్కె

అవతారిక : దేవీ కుండలముల వర్ణనము

19. వాణి సూక్తుల, నమృతంపు బాణి గ్రోలి
మోదమున, సుంత చలియించె నీదు శిరము
నీదు ఆమోద, ముద్రను నెరపుకొనుచు
కుండలంబులు, ఝణ ఝణ కుదుపులొందె॥

అవతారిక : దేవి నాసావర్ణనము

20. గళితమై, వంశి, ముత్యాల। నొలకరించె
నీదు నాశిక, ముత్యంబు। నెలవు గొనియె
లోన బయటను, ముత్యాలు। రాణయొప్ప
వంశి బోలిన నాస, ప్ర। శంస జేతు॥

అవతారిక : దేవీ అధరోష్ఠవర్ణనము

21. పగడపున్, తీగనుండవు, పండ్లు, ఉండి
యున్న అధరంపు, నరుణిమ। నుండునేమొ
బింబితంబయ్యె, నరుణిమన్। బింబఫలము
నీదు అధరోష్ఠముల బోల్చ। విధములేదు॥

అవతారిక : దేవీ ముఖవర్ణనము

22. నీదు ముఖ, చంద్ర, మాధురు। లింతగ్రోలి
నోరు మిక్కిలి వెగటు, చ। కోరికయ్యె
దాని విరుగుడు, చంద్రుని। జ్యోత్స్న త్రావె
ఇంకయున్ బోక, గంజినీ। ళ్లిన్ని ద్రావె॥

అవతారిక : దేవీ జిహ్వా వర్ణనము

23. శర్వు మహిమంబు, ననయంబు। జపము జేయ
నీదు నాలుక। నరుణిమ। నెరపుకొనియె
నీదు జిహ్వాగ్రమందున। నిలచు వాణి
స్ఫటిక రూపాన, కెంపులు। పొటమరించె॥

అవతారిక : దేవీ తాంబూల కబళ(త్రమ్ము వర్ణనము.

24. శత్రు జయమును జేసి, నీ చెంత జేరి
శివుని నిర్మాల్యమును వీడి శౌరి, శక్రు
డా కుమారుడు, భక్తిచే నీకు మ్రొక్క
కరుణ నియ్యవె, తాంబూల కబళశ్రీని॥

అవతారిక : దేవి కంఠ మాధుర్య వర్ణనము

25. శివుని లీలలగానంబు జేసుకొనుచు
చక్కగా, వీణమీటె నా చదువులమ్మ
ముదము దెలిపెడి, నీకంఠ మధురిమలకు
సిగ్గుతో వీణ, నాదంబు జేయనాపె॥

అవతారిక : దేవి చిబుక వర్ణనము

26. పుణుకు నీతండ్రి, వాత్సల్య పూరితముగ
చుబుక మది నీది, నీభర్త చుబుకమెత్తి
అద్దమున్ బోలు, నీముఖ పద్మమందు
ఆత్మదర్శనమున్, జేయు నమలప్రేమ॥

అవతారిక : దేవి కంఠశోభావర్ణనము

27. శివుభుజాశ్లేషమున, నీదు గ్రీవమింత
పులకరించుచు, కమలంపు నాళమయ్యె
అగరు మలినాన, నారత్న హారలతిక
తోచె, లలిత మృణాలంబు మించి తల్లి॥

అవతారిక : దేవీగళరేఖా వర్ణనము

28. నీదుగళరేఖ మాంగల్య బంధవేళ
చేరి కట్టిదు ముప్పేట। దారమయ్యె
మధుర రాగాలమేళపున్। హద్దులౌచు
మూడు గళరేఖ లమరె, స। మ్మోహనముగ॥

అవతారిక : దేవీ బాహు శోభావర్ణనము

29. హరుదు ఖండించ, తనదైన। శిరమునొకటి
శేషశిరముల ఖండన। చేయకుండ,
బ్రహ్మ తన నాల్గు శిరముల। బ్రస్తుతించె
నీదుహస్తాలు నాల్గింట। నిలుపుమనుచు॥

అవతారిక : దేవీ హస్త శోభావర్ణనము

30. కమలమది యేమి సాటి, నీ। కరమునకును
కమలముల నుండు, శ్రీలక్ష్మి। కాళ్ల లాక్ష
రసము కమలాల, దీపించి। ప్రసరమైన
యప్పుడానేమి, దీటు నీ। హస్తమునకును॥

అవతారిక : దేవీ స్తన శోభావర్ణనము

31. స్కంద హేరంబ తనయు, నా। నందగరిమ
నీదుస్తన యుగ్మమందున। నెనరుతోడ
ఒక్కసారిగ పాల్గుదుపు। చుండురీతి
మాతృవాత్సల్యమున, మమ్ము। మనుచుమమ్మ॥

అవతారిక : దేవీస్తన్య మహిమాభివర్ణనము

32. బాలురైయుండి, రింకను। పాలుద్రావి
స్కందహేరంబ, కుమరులు। సంతసమున
అమ్మ! నీవైన వక్షోజ। యుగ్మమమృత
భాండయుగ్మమ్ము గానెంతు। భావమందు॥

అవతారిక : దేవీ కుచాభోగ వర్ణనము

33. క్రూరుడైన గజాసురు। కుంభమణుల
హారముగ నీవు వక్షాన। నెరపుకొనగ
అబ్బురంబుగ ముత్యాలు। కబ్బురంపు
నాణ్యములదేలె, అధరారు। ణంబునిండి

అవతారిక : దేవీ స్తన్య మహిమాభివర్ణనము

34. పాలసంద్రము హృదయాన। పొలుపుదీరి
వాఙ్మయాబ్ధిగ మారె,నీ। వక్షమందు
మధుర, మౌ,నీ దు, స్తన్యంబు। మమతగ్రోలి
ద్రవిడ శిశువల్లె, కమనీయ। కవిత లెన్నో॥

అవతారిక : దేవీ రోమావళి వర్ణనము.

35. హరుని నేత్రాగ్ని జ్వాలల। నవసికొనుచ
అమరె నీ నాభి, సరసిన। నంగు, దతని
ఊర్పులవి, ధూమలతికగ। నొదవుకొనచు
నీదురోమావళిగ, నొచు। ప్రోదియయ్యె॥

అవతారిక : దేవీ రోమావళి వర్ణనము

36. కూర్మి కుచములు నొండెంటి। పేర్మి నొరసి
అంతరము నాభి కుహర, మం। దవతరిల్ల
సురుగు ఒక చిన్న కాళింది। తరగయట్లు
కరగి తేలెడి నూగారు। హరుడు జూచె॥

అవతారిక : దేవి నాభివర్ణనము

37. సతము నీనాభి, కుచ పుష్ప। లతకు కుదురు
కుసుమశరు, తేజకుండంబు। గుహగయౌను
శివుని సిద్ధికి, రతిమెరుగు। చెక్కుగృహము
గాంగ ఝరిసుడి, నీనాభి। గనెడు శివుడు॥

అవతారిక : దేవి మధ్యాళి వర్ణనము

38. కుచపు భారాన, నొక్కింత। క్రుంగు చుండి
తటిని తీరాన, నొరిగిన। తరువుబోలు
వింతరీతిన వంగి, యొక్కింతకదలి
మునుచు గావుత, నీక్షీణ। మధ్యమెపుడు॥

అవతారిక : దేవీ వళిత్రయ వర్ణనము

39. కనక కలశాల బోలు, నీ। స్తనపు బరువ
కంచుకము ప్రిదివె, దోర్మూల। కషక మయ్యె
నడుమువంచగ బిగియింప। నడుముగట్టు
తీవలను బోలియుండె, నీ। త్రివళి యెంతొ॥

అవతారిక : దేవీ నితంబవర్ణనము

40. అరుణిమిచ్చెను, గిరిరాజు। అతనివైన
గురుతభారాలు, నీయందు। కూర్మితోడ
నీదు పిరుదులు నవ్వాటి। నెరపు కొనియె
వసుధ భారంబు చులకన। బరచు చుండె॥

అవతారిక : దేవీ జానూరు వర్ణనము

41. నీదు జానూరు ద్వయ, మవి। నిక్కముగను
కురుల, కుచ, కుంభ ద్వయమును। కనక కదళి
కాండ పటలియు, మించుచు। నుండెతల్లి
వేదవేదార్థ సర్వార్థ। వేదివీవు॥

అవతారిక : దేవీ జంఘ వర్ణనము

42. నీదు జంఘాలు అమ్ములు। ప్రోదిగాగ
గోళ్లు పదియును, విశిఖాలు। కొనలు మొదలు
దేవ మకుటాలు, సానలు। తెరగుజేసి
మించె మదనుడు, శివునే। జయించగోరి।

అవతారిక : దేవీ పాద వర్ణనము

43. శ్రుతులు, నీపాద యుగళిని। శోభదేలె
పాద్యవిధిగంగ నీపదు। ప్రాంత మందె
విష్ణుమకుటంపు మణులు, పా। రాణి పెట్టె
కరుణ నీపదాలూను, నా। శిరమునందు॥

అవతారిక : దేవీ పాదయుగ వర్ణనము

44. ప్రణయకలహాన తన శిరము। నెనయు పదము
కూర్మితో యాయశోకంబు। కోరె ననుచు
ఈర్ష్యచెందెను దానిపై। ఈశుడెంతొ
అట్టి నీ పదములకు, న। నంతనతులు॥

అవతారిక : దేవీ పాదద్వయ వర్ణనము

45. పిలువ నీశుండు వేరొక్క। పేర నిన్ను
అలగి త్రోసితి వీవు, పా। దాంబు జాన
కిలకిలని నవ్వె మదను, డొ। క్కింత తృప్తి
కరుణయున్ననె, పదసేవ। కలుగునమ్మ॥

అవతారిక : దేవీ పాదద్వయ వర్ణనము

46. నీదు పాదాలు, హిమగిరి। మీద నిలచి
భక్త జనులకు, ఐశ్వర్య। పదవులిచ్చు
నిశిని నిద్రించి, హిమమునన్। నిల్వలేని
కమలముల బోల్చ, నీపద। కమలమెట్లు॥

అవతారిక : దేవీ ప్రపద వర్ణనము

47. కమఠ, కర్పూర, కఠినత। కనుచునుండి
నీదు మీగాల, సాదృశ। మెందు పొసగు
మృదుల, ప్రపదంబు, ఉపయమ। మందునెట్లు
శివుడు నొక్కెనా, దయలేక। చేతులార॥

అవతారిక : దేవీ పాద సామర్థ్య వర్ణనము

48. పాదములు నీవి సర్వసం। పదల నీయ
కల్పవృక్షాల వెంతటి। కాన్కలిచ్చు?
అనుచు నఖ చంద్ర, ఖండాలు। అపహసించె
వెన్నెలలనవ్వు వింతగా। వెలువరించె॥

అవతారిక : దేవీపాద మహిమాభివర్ణనము

49. నిండు మందార స్తబకమై। యుండు చరణ
మందు మకరందమును గ్రోలి। మధుపమౌదు
నీదు పద పద్మముల మది। నిలుపు కొనుచు
పొందెదను జన్మజన్మల। పుణ్యఫలము॥

అవతారిక : దేవీ గమన వర్ణనము

50. నలుగురయ్యలు మంచపు। నాల్గుకోళ్లు
అందు నయ్యె సదాశివు। డచ్చశ్వేత
పటముగా నీదు యరుణిమ। పంచుకొనుచు
వింతరీతిగ నీకంట। విందు జేయ॥

అవతారిక : పునః దేవీ స్వరూప వర్ణనము

51. నీదు పదన్యాస మభ్యాస। మేదిలేక
అడుగు తడబడ కలహంస। నడకయందు
రమ్య చరణాల మంజీర। రవళి నింపి
విశద మొనరించుదువు నీదు। విధములెన్నొ॥

అవతారిక : దేవీ సర్వశక్తి వర్ణనము

52. సరళహాసాన, కేశమం। దరళ యొప్పె
చిత్తమున - మృదిష్వ, తన్వియై। చేరె నడుము,
కుచనితంబము- స్థూలంబు। కుచము - కఠిన
మరుణ - కరుణలు, శక్తులై। కరుణ కనెదు॥

అవతారిక : దేవీ భోగవస్తు సంపూర్ణ కరండ (చంద్రమండల) వర్ణనము

53. నీరు పన్నీరు, నలుపుక। స్తూరి గాగ
మంచి కపురంబు, నింపిన। మణులపేటి
చంద్రబింబము - త్వద్భోగ। మందు తరుగ
బ్రహ్మనిండించు చుందును। పాటవమున॥

అవతారిక : దేవీ చరణ సేవా మహిమాభివర్ణనము

54. దేవతలు నీదు ద్వార, ప్ర। దేశమందు
సకల విధ సిద్ధులొందుచు। సంతసిలిరి
నిశ్చలంబైన చిత్తంబు। నెరపుకొనక
నీదు పదసేవ భాగ్యంబు। నెరపు టెట్లు॥

అవతారిక : దేవీ నిరుపమాన పాతివ్రత్య వర్ణనము.

55. వాణి సేవింప నిచ్చు, వి। జ్ఞాన ఖనులు
లక్ష్మి కరుణించ నిచ్చు నా। పేక్ష - నిధులు
నిన్ను సేవింప నొదవు న। నన్యసాధ్య
నిరత కైవల్య మానంద। నిలయవగుట॥

అవతారిక : దేవీ మహిమాభివర్ణనము

56. వాణీ వనుచును - హరిపత్ని వనుచు నిన్ను
అద్రి తనయ వటంచును। అనుదురమ్మ
నిర్వచింపగ లేనట్టి, నీదు మహిమ
విశ్వవిన్యాస, నాటక। విలసనంబు॥

అవతారిక : దేవీ చరణ నిర్ణేజన జలపాన మహిమ

57. వాణీ తాంబూల రసములో। దనరు చుందు
నీదులాక్షార్ద్ర నిర్ణేజ। నీర మాని
వాణీ నిలచును నవ్వాని। వదనమందు
మూకయైనను పొందు, న। మోఘ కవిత॥

అవతారిక : దేవీభక్తుడు విద్యాధనము లందుననుట.

58. నీదు భక్తుల కద నుంద్రు, చదువురాణి
లక్ష్మియును, విధి, హరులన। లక్ష్యపరచి
రమ్యవపుషవు నీవౌట। రతియుజేరు
ముక్తిచేకూరు పిదప, నీ। భక్తులకును॥

అవతారిక : దేవీ! నీవే అంతటను అనుస్యూతవై వాగ్రూపమున ప్రతిభాసించుచున్నావనుట.

59. పలుకు నీయది స్తోత్రపున్। భావమందు
రగులు జ్వాలలు రవికి, నీ। రాజనంబు
ఉబుకు నమృతంబు, నర్ఘ్యంబు। ఉదుపతికిని
దప్పి దీర్తును అంబుధి। దాహమంత॥

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

************************************

అన్యధా శరణంబు, లే। దనుచు నెంచి
చిన్న శతకాన, నీస్తుతి। చేసుకొనుచు
మ్రొక్కు, శ్రీరామకృష్ణుని। మోదమలర
కాచిరక్షించు, కల్యాణి। కల్పవల్లి

- శ్రీరామకృష్ణ భరద్వాజ

పింగళ - చైత్రము

************************************

# సకల కల్యాణి శతకము

కృతి సమర్పణము
విజయవాడలోని ఇంద్రకీలాద్రిపై వేంచేసియున్న....
శ్రీ మల్లేశ్వర సహిత శ్రీ కనకదుర్గాంబాదేవీ
పూజ్య పాదారవిందములందు భక్తితో సమర్పితము

**శ్రీరామకృష్ణ భరద్వాజ**
(కీ.శే. వఝ శ్రీరామకృష్ణమూర్తి)
(1918 - 1986)

శ్రీ

1 తే॥ 'ఓ' మటంచుచు, 'ఐ'మని। హ్రీమటంచు
'శ్రీ' మనుచు, నీదు జపమును। చేయజాల
అహరహము, నీదు చరణంబు। లంటియుందు
సకల కల్యాణి! శర్వాణి! శరణు తల్లి.

2. కరుణ నాలికించి, గావుము। కల్పవల్లి
ఏదుగడనీవె, లోపాల। నెంచకమ్మ
ఈవె సర్వంబు, ననుచునే। నెంచుచుంటి
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

3.. లలిత లావణ్య, రంజిత। శ్రీలదేలు
హ్రీమతీ! నీదు పదము। లూహింతుమదిని
హరి విరించులు, మ్రొక్కగ। నలరుచుండ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

4. సర్వమంగళ, కొలిచెద। సర్వమీవె
కరముసృష్టించి, బెంచి, లో। కాలనెల్ల
హరుని తాండవ, 'శ్రీ'లలో। కరుగజేయు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

5. లలిత చిద్రూప, లావణ్య కవిత వీవు
'హ్రీ'మనుచు, నిన్ను యోగులూ। హించుకొనిరి
సకల పురుషార్థముల, గోరి। స్వాంతమందు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

6. కనక కాంతుల, కమలముల్ఁ దనుపుదివ్య
లలిత లావణ్య, చరణముల్ఁ తొలుతగొల్చి
ప్రేమమీర! నిన్నుదలతు, నఁ హీనభక్తి
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

7. శుద్ధ శరదిందు, చంద్రికాఁ స్ఫూర్తి నిండి
మకుట, మాణిక్య, కాంతులఁ మణులు వెలుగ
నొప్పు, నీరూపు, ధ్యానించుఁ చుందునెపుడు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

8. వాణి ప్రేరణ, గంభీరఁ వాక్కులలరి
మధుర, గంభీర కవితలఁ మధువులొలుక
అరుణకాంతుల, నలరు,నిఁ న్నాత్మదలతు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

9. పూని స్మరియింతు, నిన్ను, భఁవాని యనుచు
నీదు పదముల, చెంత,నెఁ నిలతునమ్మ
నీదు కరుణార్ద్ర, దృష్టినిఁ నిలుపుసుంత
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

10. ఒనరు సర్వంబు, నీవయైఁ యొప్పుచుండు
టరసి నిన్ను భవాని, యంఁ చాత్మలోన
ఋషులు ధ్యానింతు,రని మేష దృక్కులగుచు,
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

11. కాంక్ష విశ్వంబు, సృజియించి గాచుతల్లి
కరుణ గనుమమ్మ, నాపాలి కల్పవల్లి
కార్యకారణ, నిర్ముక్త కావెనీవు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

12. సూర్యచంద్రులు, వెలుగు, నీ చూపుతోడ
మారుతము, నీదు శ్వాసచే మహితమౌను
మృత్యువది, నీదు కనుసన్న నృత్యమాడు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

13. మహిత, సోమ, ప్రభాభాస మానవీవు
జ్వాల మాలాచ్ఛ, విద్యుదో జ్వాలవీవు
కనక పుంజాభ! మన్మనో కామ్యదాయి!
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

14. పిలతునమ్మా! యటంచు, నిన్! ప్రేమతోడ
నాదు ఇంద్రియ గణములు నాదు మనసు
ప్రాణమును, నేకస్వరమున పాట బాడ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

15. కరుణ యున్ననె, పదసేవ కలుగునమ్మ
నీదు పదపద్మముల, మది నిలుపుకొనుచు
పొందెదను, జన్మజన్మాల పుణ్యఫలము
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

16. రమ్యచరణాల, మంజీర। రవళినింపి
విశ్వవిన్యాస, నాటక। విలసనమ్ము
లేశ మెరిగింపు, నీపద। న్యాసమందు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

17. నిన్ను సేవింప, నాదవున। భిన్నబుద్ధి
నిత్య కైవల్య, వానంద। నిలయమగుట
మాతృవాత్సల్యమున, నన్ను। మలచుమమ్మ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

18. సురగణ శ్రేణి, తలదాల్చు, చరణయుగళి
శిరమునన్ దాల్చి, నీదైన। కరుణచేత
పొందగా జూతు దివ్య, సం।పూత పదవి
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

19. సూర్య్య తేజము, శశిరేఖ। జూపుచలువ
ఆకసంబున ధ్వనియు। బంగారువన్నె
ఆత్మజ్ఞానము, నీవె, స। ర్వాత్మవమ్మ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

20. సర్వలక్షణ సంపన్న సకల, సంప
దలకు నిలయంబు, లోకాల। తల్లివీవు
నిన్ను శ్రీమాత! యనుచు, నే సన్నుతింతు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

21. భూత సకలంపు, కారణ। భూత వీవు
సకలలోకాల, పోషణ। శక్తివీవు
శ్రీమహారాజ్ఞి! నీకు, నే। చేతునుతులు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

22. సృష్టి స్థితియును, లయమును। చూడనీవె
బంధమోక్ష స్వరూప, సం।బంధ వీవె
సింహవాహన! ఈశ్వరీ। చేరికొలతు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

23. శుద్ధ నిర్మల, స్ఫటిక, వి।శుద్ధ రుచుల
నీదు వెలుగులు, నాలోన। నింపుమమ్మ
అంతరాంతర, తిమిరంబు। నణచుమమ్మ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

24. పుష్పబాణంబు, చాపంబు, పూన్చిచేత
పాశ, మఙ్కుశ, హస్తవై। పరగు చుండ
అరుణ తేజాన, నన్నాదు। కరుణనుంత
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

25. స్వర్ణ పద్మాలు, కరముల। స్వర్ణకాంతి
తనువు, దీపింప, సురలు, సంస్తుతులు జేయ
అభయమిమ్ము భవాని, ని। న్నాత్మదలతు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

26. నుదుట కుంకుమ, కస్తూరి। ముదము గొలుప
అరుణ భూషోజ్వలాంగి! మా। యమ్మవీవు
మన్దహసితేక్షణంబుల। మమ్ముగావు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

27. వర, సుధా ధౌత, విద్యుత్తు। భావ వీవు
పాశ మఙ్కుశ, పుస్తక। పాణి వౌచు
ఉజ్వల త్కాంతి, నాలోన। ప్రజ్వలింపు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

28. కంఠహారము, ఉజ్వల। కాంతులీన
అరుణిమలుదేలు, దీధితి। ననవరతము
లోని కమలాల, దనుపు, త్రి। లోక జనని
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

29. దశదిశల, వెల్లులన్నింది। దనియుతల్లి
లలితమౌ నీదు, చిద్రూప। కళలనొప్పు
కిరణకాంతుల, నన్నింపి। కరుణగనుమ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

30. భాను సాహస్ర, సుప్రభల్। బరగిమించు
నీదు, కిరణాల, లోక, స। మ్మోదమిచ్చు
సర్వ లోక, శరణ్యగా। సంస్తుతింతు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

31. పద్మరాగాచ్ఛ, రోచిర్వి భాసితంబు
కనక కోటీర, ప్రభ చంద్రః కాంతిగలపి
జగతి వెన్నెల, బూయించుః జనని వీవు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

32. వదన కాంతుల, లోకాలుః వరలుచుండ
కమలముల బోలు, నేత్రాంచః లముల కరుణ
కాచి రక్షించు, కనకాభః కరుణమమ్మ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

33. దివ్య నఖ, చంద్రఖండాలః దీప్తి నిండు
నీదు చరణాల, భక్తి నెః న్నుదురు సోక
తిమిరముల బాసి, సుజ్ఞానః దీప్తినందు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

34. లలిత సౌందర్య, కరుణార్ద్ర, కలితవీవు
పాద మంజీర, రవళీ ప్రః మోద శుభద
మందగమనవు, మందస్మిః తేందు ముఖివి
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

35. రక్త, శుక్ల, ప్రభా, మిశ్రః రాజితంబు
పద్మము, లవేటి సాటి, నీః పదములకును
హృదయ పద్మాన, పూజింతుః ముదముగొలుప
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

36. అరుణ వస్త్రంబు, చందన। మరుణిమంబు
మణులు, భూషలు, మందార। మాలికలును
అరుణ తేజంబు, నీవు, స। ర్వారుణిమవు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

37. శివకరంబుగ, జీవిత। శోభలొలుక
శ్రీశివా! యంచు కొలుతు, నశేషభక్తి
శివుని అంకస్థవైనీవు। చెలగుచుండ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

38. భావనాగమ్య నీవు, భ।వాని నీవు
భక్త సౌభాగ్యదాయివి। భద్రమూర్తి!
భయము తొలగించి, కావుము। భక్తునింక
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

39. సర్వవిద్యల నొసగెడి। సాధ్వియామె
వాణి! నాయందు, కృపజూపి। వరలుచుండ
శారదారాధ్య! నిన్నునే। సంస్తుతింతు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

40. రమ్య, రాజీవలోచనీ! రాజ్ఞినీవు
రాజరాజార్చిత, పదాం! భోజనీవు
రాజరాజేశ్వరీ! కావ। రమ్ము కరుణ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

41. సర్వలోకాల నేలెడి। శక్తివీవు
తల్లి! నాయందు దయసుంత! దలుపుమమ్మ
తనదు సర్వంబు నీవయై। దనుపుమమ్మ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

42. భక్తహార్ద తమోహారి। భావగమ్య
పావనంబైన, నీపాద। ప్రభల నింపి
భవరుజలనుండి, గావుము। భక్తునింక
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

43. ప్రకృతిమయి వీవు, లోకాల। ప్రాణమీవె
కాలరూపివి, విశ్వవి। కల్పమీవె
పావనాకృతి నన్ను, కా। పాడవమ్మ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

44. వేదమయి వీవె, నాలోని। నాదమీవె
సకల సంకల్ప రూప, శు। స్వాంత వీవె
నామరూప, వివర్జితా। నందరూప
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

45. కనుచు జగతిని, ఆ ఉషః। కాంతి దనిపి
విలయ కాలాన, విశ్వమున్। వికృతి జేయు
సర్వకారణ, సంధాత్రు। శక్తివీవు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

46. స్తుతి మతీ, నిన్ను గొల్తు, సం। స్తుతులు సలిపి
నిస్తులంబైన నీకృప। నిలుపు మమ్మ
కరుణ గాంచెదు, సత్య, సం। కల్పవీవె
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

47. వివిధ రూపాల, స్థితులందు। విదిత మౌచు
అన్నిటను నాదు, జనని! నీ। వాదు కొనగ
కానరానైతి, మోహాంధ। కార వశత
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

48. అన్ని పనులును, జేయుచు। నాదు కొనగ
నీదు హస్తోపకరణంబు। నౌదు నమ్మ
ఎటుల నాడించి, నను, నీదు। ఇచ్ఛయింక
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

49. స్కంధ, హేరంబ, తనయుల। సాకినటుల
మాతృ వాత్సల్యమున, నన్ను। మనుచుమమ్మ
నిన్ను విడనాడి, నేనింక। నిలువలేను
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

50. నాదు మదిలోని, యనురక్తి। నవ్యరీతి
విన్నవించగనేల? యు। భిన్నవౌచు
సర్వమున్ నిండి, నీవుండ। స్వాత్మ తేజ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

51. వేద వేదార్థ, విజ్ఞాన! వేత్తగాను
తెలియగా లేను, నీదు సం। దేశ మింత
హృదయజ్యోతిగ, వెలుగుల। నొదవుమమ్మ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

52. మదిని బూచెడి, దివ్య, సు। మాలనన్ని
పట్టుదారాల మాలగా। పట్టు కొనుట
నీదు కృపలేక, నేనెట్లు। నేర్వగలను
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

53. నీవు నామది వీడిన। నిముసమందు
హృదయ స్పందన లాగిన। విధమునుండు
ఆటలాడించు జీవవు। నాటనీవె
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

54. విశ్వమోహన నాట్య, సం। వేద్యవీవు
ఉషః కాల శోభల। నిలకు దిగుచు
మాదు బ్రతుకుల దీపించి। మలచుమమ్మ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

55. పరగి, యా వాణి, నీనుతుల్। పాడుచుండ
చెలువముల, నింపు లక్ష్మి, నీ। చెంత నిలచు
అట్టి చరణాలు, నేనెట్లు। పట్టువిడతు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

56. చరణ మంజీర, రవళిని। చలనమంది
పరగి విశ్వంబు, నీపాదు। పరిధి దిరుగు
అట్టి చరణాలు, నాహృది। హత్తుకొనెద
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

57. అరుణ లాక్షార్ద్ర, రాగ, సం। భరితమైన
నీదు చరణాల, శిరమూని। నిన్ను దలచ
అరుణ రాగంబులో, నే। కరుగుచుందు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

58. మధుర మంజుల, కింకిణీ। మంద్రరవము
చెవుల విందుగ, వినుదంచు। చెంత జేర
రవళి నాలోన, నిండుచు। ప్రణవమౌను
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

59. దివ్య కమనీయ గ్రైవేయు। దీప్తియందు
చూపులన్ నింపి నినుదేరి। జూచుచుండ
చిన్ని గజ్జెల రవములో। చిత్తముడుగు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

60. నీదు తాటంక ప్రభలందు। నిలువ దృష్టి
సూర్యచంద్రుల పరిధుల। సుళ్లుదిరిగి
మానసాంబుధి లోనన్ను। మరచిపోదు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

61. దివ్యమణి రత్న సందీప్త। భవ్యమకుట
మందు, జూపించి, నీమోము। నరయుదన్న
ఏదొ, తేజో విలాసంబు। ఎదదగ్రమ్ము
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

62. వరలు, సాయుజ్య పదవుల। వాంఛలేదు
నీదు పద పద్మముల, మది। నిలుపుకొందు
మధురిమల వింత, తేల్చుము। మాత చాలు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

63. ప్రణమమీవయె, ప్రాపంచ ప్రభవమీవె
పంచభూతంబులున్, ప్రాణ। పంచకంబు
చరము, స్థిరమును, సర్వమున్। జనని నీవె
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

64. శబ్దమీవయె, శ్రవణపున్। శక్తి నీవె
కన్నులన్, నిన్ను నీవయె। కాంతువమ్మ
నీవె బహిరంతరంబుల। నీవె నిజము
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

65. మనసు బుద్ధియు, చిత్తమున్। మహితమైన
పలుకు, భావంబు, నీవయై। పరగుచుండ
చలిత మందుచు, దోచునీ। సర్వజగతి
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

66. చంద్ర, సూర్యులు, నక్షత్ర చయములన్ని
గ్రహములున్, సర్వ విశ్వంపు, గతియు నీవె
అణువు నీవయె, విశ్వమా హత్వమీవె
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

67. మూడు గుణముల, ముల్లోక ములను గప్పి
అన్ని పాత్రల, నొక్కటై యాడు కొనెదు
ఆట-ఆడుట- ప్రేక్షకు దన్ని నీవె
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

68. తల్లియును, దండ్రి, గురుదును దైవమీవె
అయిన పిలుతును నిన్ననే నమ్మయనుచు
కరుణ దరి జేర్చుకొనుము, యీ కన్నసుతుని
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

69. మధుర మౌనీదు మానస మాధ్వినిండి
ఇక్షుఖండంబు, నీచేత ఇంపులీన
మధువులొలుకు మ,నా మనో మందిరాన
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

70. ముక్తియేలను, సాయుజ్య రక్తియేల
నీదుకరుణామృతంబులో నింపుకొనిన
చాలు నాకది, అన్య, మింం కేల నాకు.
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

71. అంబరంబున నరుణిమ। లాడినపుడు
అరుణిమల విచ్చి, అంబుజ। మలరినపుడు
నీదు వదనంపు శోభలె। నిండునమ్మ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

72. నీదు మకుటాన జాబిల్లి। నీటుదేరి
చల్లవెన్నెల ఇల, వెద। జల్లుచుండ
చేరి క్రోలెద, జ్యోత్స్న, చ। కోరి నౌచు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

73. ఉదయ భానుని రాగ, సం। పదలనింత
అంబుజంబుల నింపు, యో। యమ్మ నీవు
మనసు కోవెల వెలుగుల। మలచుకొనెద
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

74. చక్రమొక చేత, శంఖమ। దొక్కచేత
పంచపుష్పాలు, విశిఖాల। ప్రభలనొకట
చెరుకు విల్లది, వేరొక్క। చేత నిలుపు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

75. శబ్ద బ్రహ్మాత్మికంబుగా। చలనమంది
నాదమదినాల్గు విధముల। మోదమలర
శంఖ మోంకార మొత్తినీ। చేత వెలుగు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

76. కాలరూపివి, లోకాల నేలుతల్లి
కాల గమనంబు, నీవు, చ క్రానద్రిప్పి
పాలనము జేతు వఖిల, లో కాల ముదము
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

77. పంచతన్మాత్ర లే, పుష్ప పంచకంబు
నొచు నీచేత, రూపును దాల్చుకొనగ
పరగుచుందుమ, నా మనోం బరమునందు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

78. అన్ని చేతుల, నన్నియు నలరుచుండ
వరద ముద్రయె, నెందును నరయనమ్మ
వదలనింక, భవాని, నీ పదమె దిక్కు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

79. కార్యకారణ రూపివి కాలరూపి
మృత్యుమధని, మహాశక్తి మోహనాశి!
కాలహన్త్రివి, శ్రీమహా! కాళివీవు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

80. ధైర్య మొసగుచు, జీవన దైన్యముడుపు
దుర్గ! దుర్గతిహారిణీ! దుఃఖ హన్త్రి!
దుర్గమంబేమి? మాకు, మా దుర్గవీవు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

81. త్ర్యక్షరివి నీవు, త్రిగుణవు। త్రిస్థవీవు
త్రిదశవంద్యవు, త్రిపురేశి। ధీరబాల
త్రిపుర సుందరి! కావుమ। మ్మెపుడు కరుణ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

82. సకల జ్ఞానక్రియేచ్ఛ సం। చాలవీవు
దివ్యగంధాఢ్య! సింధూర। తిలకకళల
లలిత లావణ్య మొప్పు శ్రీ। లలితవీవు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

83. సకల సంపత్ప్రదాత్రివి। స్వస్తిమతివి
శ్రీమహారాజ్ఞి! శ్రీకరీ! సూక్ష్మరూపి
రాజరాజేశ్వరివి, నీవె। రక్షమాకు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

84. పూజ్య రూపివి! బహురూపి। పూర్ణవీవు
బ్రహ్మరూపివి, బ్రహ్మణి! భక్తిగమ్య
భవము బాపెడి, భగవతీ। పదమెదిక్కు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

85. వాగధీశ్వరి, విమలను। వ్యాపివీవు
వాంఛితార్థ ప్రదాయివి। వరద వీవు
వర్ణరూపిణి! సర్వ, స। ర్వాంతర్యామి
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

86. నిత్య బుద్ధవు, నిర్మలా! నిత్యతృప్త!
నిర్వికారవు, నిర్మమా! నిత్యవీవు
నీవె నారాయణివి, నిన్ను నిత్యమెంతు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి

87. విశ్వవ్యాప్తివి, వైష్ణవీ! విశ్వరూపి
విశ్వసాక్షిణి! శర్మదా! వేదవేద్య
విష్ణురూపిణి! వ్యాపినీ! విజయివీవు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

88. శాస్త్రమయి వీవు, శాంభవీ! శాస్త్ర సార
శారదారాధ్య! శాశ్వతీ! శాన్త్య తీత
శిష్టపూజిత! శివకరీ! సేవ గానుమ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి!

89. ఇడయు నీవయె, పింగల! ఐడయు దీవె
మెరపు తీవగ అందాలు! నెరపు కొనుచు
శోభనర్తించు చుండు, సుషుమ్న వీవె
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

90. పద్మములు విచ్చి నీ ప్రభల్! పరచుకొనుచు
వింతరీతుల, నాతటి! త్కాంతి వెలుగ
నాదులోనిండి నాట్యాల! నాదుమమ్మ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

91. మూడు మూర్తులు గ్రంథుల। ముడుచు కొనుచు
ఊర్ధ్వగతి నొంది గ్రంథుల। నొనరదాటి
వేయిరేకుల కమలాన। వేద్యనాదు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

92. బ్రహ్మదండపు, మూలాన। బరగి నీవు
నిండి నిద్రించు, యామహా। కుండలినివి
నిద్రలేవమ్మ, నన్నేయ। భద్రమతిగ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

93. ధ్యాన గమ్యపు స్వాధిష్ఠ దళమునందు
లోని చీకటి పోగొట్టి। పూని వేద్య
అభిమతంబుల, నొందెడి। యాశగొల్తు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

94. కనక నాళాన, కాంతులు। కళలునింపి
చనుచు, నీవు జేర మణిపూర। సరసియందు
పూజ సేతును, మణులతో। పుణ్యలభ్య
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

95. వేదమయి వీవు సర్వ, సమ్మోద విధిని
నా, యనాహత కమలంబు। నాదమంద
పరగి,లో నుండి, తెలుపు నీ। భావములను
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

96. వీరవస్తువు! వైఖరీ। వేద్యవగుచు
నాదకళ నింపి, లోన, నా। నందగరిమ
శుద్ధ వాక్కుగ, నిల్వు, వి। శుద్ధమందు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

97. ఆజ్ఞ చక్రాన, భాసించి। సహరహంబు
జ్యోత్స్నలోకాల, యందున। జొరగ జూచు
నిన్ను భావింతు! శుభకరీ! నిత్యమేను
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

98. చంద్రమండల దివ్య, సం। చారివవుచు
వేయిదళముల, వేద్మలో। వెలుగు నీవు
సుధను వర్షింప, జేయుమీ। శోభలొలుక
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

99. ముదము లొలికించు, నీజ్ఞాన। ముద్రయందు
సుంత జ్ఞానంబు, పొందెద। సుముఖి వగుము
జ్ఞాన, జ్ఞేయ, స్వరూపిణీ। జ్ఞానదాత్రి
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

100. సకల జనములు, గానంబు। సలుపుకొనగ
కరుణ బ్రోచెదు, గాయత్రి। కనగ నీవె
సకల ఛందస్సుధా, సార। సన్నుతింతు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

101. భాను మండల మధ్యస్థ! భాసురాంగి
సకల జనముల, కాధార! శక్తివగుచు
వినుతి జేతును! సావిత్రి! విశ్వజనని
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

102. కాలరూపివి, శ్రీమహా! కాళివీవె
లాస్యప్రియవైన శ్రీ మహా! లక్ష్మివీవె
సత్య సన్నవు, శ్రీసర! స్వతివి నీవె
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

103. భయము బోగొట్టి, బాధల! బాపు మమ్ము
భవరుజల నుండి, గావుము! భద్రమూర్తి
మృత్యు మధనివి, లేదింక! మృత్యుభయము
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

104. సర్వదారిద్ర్య బాధల! సంకటముల
పాలబడ కుండ కాపాడు! పాశహస్తి
సకల సుఖదాయి! శ్రీమాత! స్వర్ణగర్భ
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

105. జ్ఞాత్రి వీవయి, జ్ఞేయంబు! జ్ఞానమీవె
జ్ఞానవిగ్రహ! జ్ఞానదా! జ్ఞాన గమ్య
జడుడ నైనట్టి నాకింత! జ్ఞానమిమ్ము
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

106. సకల పురుషార్థములనిచ్చు! జనని నీవు
నిన్ను దలచిన మాత్రాన। నిరత సౌఖ్య
శ్రీల, పొందుచు, సర్వథ। యాలు దొలగు
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

107. తప్పులున్నను, మన్నించి। తనయునందు
ఒప్పులను బెంచు, నొప్పుల। కుప్పవీవు
దేవి! భాగ్యాబ్ధి, చంద్రికా! దిక్కు నీవె
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

108. అన్యథా శరణంబు, లే। దనుచు నెంచి
చిన్న శతకాన, స్తుతియించి। విన్నవించు
రామకృష్ణుని, కాపాడు। రక్షనీవె
సకల కల్యాణి! శర్వాణి! శరణుతల్లి.

శ్రీ
శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

************************************

**ఆనందలహరి** (పద్యకావ్యం)

నాదు, మది నుబుకు గీతాల। నాలపించి
పలుకరంబుల, రాగాల। ఫణితు లివియె
అంకితం బిత్తు, నీపాద। పంకజముల
నీకు, ముదమైన నేవియో। నెంచుకొనుము.

– శ్రీరామకృష్ణ భరద్వాజ
(కీ॥శే॥ వరుఖ శ్రీరామకృష్ణమూర్తి)

************************************

# ఆనందలహరి (పద్యకావ్యం)

కృతి సమర్పణము
శ్రీక్షేత్రమయిన బాసర నగర విలసిత
శ్రీ జ్ఞానసరస్వతీమాత
పూజ్య పాదారవిందములకు
భక్తితో సమర్పితము

శ్రీరామకృష్ణ భరద్వాజ
(కీ.శే. వరుఖ శ్రీరామకృష్ణమూర్తి)
(1918 - 1986)

శ్రీ

శ్రీ మాత్రే నమః

1. శ్రీకరంబుగ, ననిశంబు। చెంతజేరి
నిలచి యుందువు, యిచటనె। నెమ్మితోడ
ననుచు, మదినెంచి, యుంటి, నో, యమ్మ, రమ్ము
కరుణగను, తల్లి! నాపాలి। కల్పవల్లి॥

2. శ్రీలు కురిపించ, నిండొచు। చెలగుప్రేమ
నీవు ఏతెంతు వనుచు, నే। నెదురు చూచి
నీకు స్వాగతంబుగ, సమ। ర్పించు కొరకు
సంతరించితి, బహువిధ,। వస్తుచయము॥

3. దిశలు, మెల్లన నరుణిమల్। తేలుచుండ
అంబుజంబులు, అరుణిమ। నలరుచుండ
వచ్చెదవు నీవటంచును,। పచ్చనైన
తోరణాల్ గట్టి, యుంచితి। త్రోవలందు॥

4. దివ్య మణినూపురాలు। ధీధితులు నిండె
ఫాల మష్టమీచంద్ర, శో।భలను దీర్చె
కబరి మల్లెల, తావులా। కాశమలమె
పాద మంజీర రవళి, నా। మదిని నిండె॥

5. మేలి పచ్చలు, దీరునీ। మేనియందు
పద్మరాగాలు, ప్రభవించి। పరిఢవిల్ల
ఆకసంబున, దివ్య, ప్ర। శాంతి యలుము
వచ్చెదవు నీవటంచు,నే। నెంచు చుంటి॥

6. దివ్య కమనీయ కాంతి, గ్రై। వేయమలర
సూర్య, చంద్రులు, తాటంక। స్ఫూర్తి నంద
దిశలు, కరభూషణాదుల। తేజ మలర
తేజ మందున, నీరూపు। తెలియనుంటి॥

7. మకుటమున, రత్నకాంతిస। మ్మానమంద
నీదు వదనాన, జ్యోబిల్లి। నిండియాడ
కందళించుచు, నెలవంక। కదలియాడ
చుక్కయందున, నినుజూడ। మక్కువయ్యె॥

8. శీతమందాకినీ, సరి। త్సైకతాల
అలతాంత, నికుంజ, పుం। జాలచ్ఛాయ
నీదు పదములు, కడుగ, పు। నీత వారి
సిద్ధమొనరించి, యుంటి స। న్నద్ధమౌచు॥

9. సుమ నికుంజాల, ఛాయల। సొబగు లీను
చంద్రకాంత శిలావేది। సిద్ధ పరచి
శీతలంబైన, వాయువుల్। వీతు ననుచు
పద్మపత్రాల, వీవనల్। పట్టియుంటి॥

10. స్వర్ణ భాండాన, అమృతంబు। అంతనింపి
నీదు దరిజేరి, నైవేద్య మిత్తుననుచు
కోర్కెలేవియొ, నాలోన। గుబురుకొనియె
అమృత రూపిణి, నీవురా। వమ్మవేగు॥

11. పూర్వ దిగ్భాగ, మరుణిమ। లూరుచుండె
నింగి నక్షత్రముల, కాంతి। నిగుడు చుండె
కళల, జాబిల్లి క్రుంకెడి। వేళయయ్యె
ఎపుడు వత్తువు నీవు, జాగేల తల్లి॥

12. హృదయ నాడుల, మెలివెట్టి। నొత్తిజేసి
జ్యోతి వెలిగింతు, నీకంటి। జ్యోతి చెంత
తల్లి! రావమ్మ, హృదయాంతరాళ మందు
చేరు మార్గంబు, వెలుగుల। దీరుకొనగు॥

13. భ్రమర మది, నందనోద్యాన। సీమలందు
కోరి, మధువును నీకయై। కూర్చెతల్లి
ఈమధుమాస, సంధ్యాపు। నీత సమయ
మందు విచ్చేసి, చేయు మా। స్వాదనంబు॥

14. దళములన్ విచ్చి, కన్నుల। కలలుగనుచు
చిన్న సుమమిది, చూపుల। విన్నవించె
నీదు గళసీమ, సుమమాల। యందుజేరి
సౌరభంబుల, దిక్కుల। బరతుననుచు॥

15. కాలియందెలు, చిరుగంటు కలసి, మ్రోయ
లీలనర్తింపు, నీదుమొగు సొలననుచు
బహువిధంబుల, భంగిమల్ పట్టికొనుచు
గజ్జగట్టితి, పరికింప గదవె తల్లి॥

16. తీగలగియించి, బిగియించి తీయనైన
రాగ మాలపించెదు, కోర్కెను రాగమాడ
హృదయపున్, వీణ శృతిపెట్టి మోదమలర
తంత్రి మ్రోగించి, చూతు సుతారముగను॥

17. నీదుగళ సీమ, నింపుల నింపుననుచు
ఈ సుమంబుల మాలగా తీర్చియుంచి
బంగరపు పళ్లెరంబున పట్టియుంటి
చిన్న కోర్కెను, ఎటులో మ న్నింపుమమ్మ॥

18. ఎన్నొ, భావాల, పగడాల వెలికి దీసి
నీదు గళమున, నర్పించు కొందుననుచు
మెచ్చు గీతాల, సూత్రాల గ్రుచ్చుకొనుచు
పట్టు సంచుల, నిన్నింటి పట్టియుంటి॥

19. అరుణరాగంబు, వేకువ నలరువేళ
నీవు యేతెంతు వనుచును ఇటకు జేరి
చల్లనగు వార్త, యొకటి, నా చెవుల చెప్పె
మెల్లగా, శీతపవనంబు మేనునిమిరి॥

20. నీశుభాగమవార్త నన్నింత జేయ
వరలు, పులకించి, పువుపూయ। నొదిగి యొదిగి
నీదువదనాబ్జమున, దాగి। యుందుననుచు
అంతరంగ, తరంగ, మం। తంతయయ్యె॥

21. నీదు కన్నుల, కరుణతో। నిమిడి కొనుచు
చంద్రకిరణాల, నుదువీధి। నీదు వెంట
ఉయ్యాలల, నూగి నట్టుల। ఉజ్వలంపు
లోని భావంబదేదొ, లో। గొనియెనన్ను॥

22. ఎవరొ వెన్నంటి, నిలచిన। యట్టులుండె
కరపు కంకణ, క్వణ, ని। క్వణములవియె
చెవుల వినవెయ్యె, చిరుగంట। రవళియేమొ!
ఉండె, నాచెంత, నడయాడు। చుండినటుల॥

23. ఆనిశాంత, మధుర, ప్రశాంతవేళ
చల్లగా, నాదు దరిజేరి। చనువుమీర
తట్టిలేపుచు, నున్నట్లు। తలచుచుండ
ఇంతలో, నేమి తిమిరాన। నింకిపైచె॥

24. కళల నిందుచు, వచ్చిన। యటులెవచ్చి
తేరిజూడగ, నేమాయె। ఏమి మాయ
కనుల ఎదుటనె, కాలంబు। గడచిపోయె
నిన్ను గనలేని, నావిధి। నేమనందు॥

25. కలగ ఇటు, వచ్చినా కన్ను గప్పనేల
అంత కోపమదేమి, నా యందు తల్లి
కరుణ లేకున్న, బ్రతుకంత కలియెయౌను
కాంతి హీనపు, బ్రతుకున వెతలెమిగుల॥

26. ఎన్ని కోర్కెల, సుమములు నెంచియుంటి
నీదుపదముల, నర్పింత నిత్తువనుచు
వచ్చినటువచ్చి, జాలి, యా వంతలేక
తలుకు మనిపించి, వెడలితి వేలతల్లి॥

27. జనని ఏమది, సుంతైన జాలిలేద?
అంతరంగాన, వెలుగు, ర వ్వంత వెలిగి
తేరి జూచుచు, కన్నుల తెరచులోన
చీకటుల గప్పివైవ, నే నేమిచేతు॥

28. అది మొదలు, నీదు రాకకై ఎదురుజూచి
ఇపుడు వత్తువు, నీవిప్పు డిటకు వత్తు
వనుచు, కన్నులవత్తులు వైచుకొనుచు
ఎదురు జూచితి, నీవరు దెంతువనుచు॥

29. ఎంత కాలంబో, నిన్‌జూడ నెంచియుండి
కనులు, కాయలు కాచిన కరణినయ్యె
నీదు రూపంబు, మదినెంచు మధురక్షణము
మరలు గొలుపుచు, మురియించు మమత రేపి॥

30. వచ్చినటువచ్చి, నీవెందు। లరగి నావు
ఏమి చేతును, ఈదివ్య సుమములన్ని
భావమున, కోర్కెలన్నియు। బరువులయ్యె
ఇంత సమకూర్చ, నామది। వంత మిగిలె॥

31. అరిగితివి నీవు, ఆశ ని। రాశజేసి
మరగితిని నేను, హృదయ జ్వాలానలాన
మనసు, మమత, లవన్ని, నా। మదిని రగిలి
కలల, కోరిక, లవుచునా। కవిత మిగిలె॥

32. అమృత, మింకెను, సైకత। సీమలందు
జ్వాలకొండెక్కె, నిట్టూర్పు। గాలియందు
పదము, తడబడె, భావనా। పటిమవీడి
నాదు నర్తన, మిక విషా। దాంతమేన॥

33. ఈ విశీర్ణ గళాన, నే। వేవా ఫణితు
లెట్టు ఈ జీవితాన, న। ట్టిట్టులొచు
మధుర భావాల, రాగాల। మలచు కొందు
చివుకు జీవితమేన, ఈ।చింత నిండి॥

34. ఎచటి తిమిరాంధ పటలి, నా। ఎదద్రమ్మి
అహరహము, చీకటి స్ముంచి। ఆవహించె
ఎందు వెదుకుదు, ఇటునటు। నెందుజూతు
వెతల బ్రతుకయ్యె, వేదన। లింతమిగిలె॥

35. పరవశింతువు, నీవని। పరిమళమున
నీదుగళ సీమ, నర్పించ। నెంచి ఎన్నొ
మాలలల్లితి, దివ్య, సు।మాల తోడ
దారమే త్రెంచ, గళమున। తీరులెటులొ॥

36. నీకొరకు, సంతరించిన। నీరజములు
మల్లె మందార, సుమముల। మాలలన్ని
నేలబడి వాడి, వరుగౌనొ। ఏమొ? తల్లి!
బ్రతుకు లెండిన, పరిమళ। మేమిమిగులు॥

37. మధుర తర, పరాగముల, నెం। తెంతొతెచ్చి
నీవు నడయాడు, బాటల। నింపినాను
ఏదొ సుడిగాలి, ధూళిగా। జేయుచుండ
గాలి బ్రతుకుకు, నాకింక। ధూళిమిగులు॥

38. ఈ నికుంజాలు, ఇంతేసి। ననలమించి
పల్లవించి, సుమించి శో। భలను నింపు
నీదు యాలంబనమె, యరు। దైననాడు
ఇలను శుష్కించి, కృంగి, కృ।శించిపోవు॥

39. నీదు పద, యుగ్మముల జేరి। యుందుననుచు
దివ్య సుమముల, తనువును। దిద్దుకొంటి
తల్లి! రావేని, దివ్య, సు।మాల తోడ
తను సుమంబును, రాలు, భూ। తలమునందు॥

40. తీగ తెగి పోయె, తంబుర। నేమిచేతు
తంత్రి బిగియించి, శృతిని, మ్రోయించు టెట్లు
తీగ బిగియించ, తంబుర। పగులునేమొ?
యనెడి వంతన, నేనుండ। యలుకయేల॥

41. కనుబొమలు, శక్రచాపంబొ? యనుచునుండ
వివిధ వర్ణాల, తేలుచు। వెడలుదనగ
చూపు శరముల, లోకాల। జూతువేల
కనుల నిప్పులు, కురిపించ। కనుదునెట్లు॥

42. మిన్ను వెలిగించి, భువిని, మండించి వేల్పు
గ్రీష్మ తాపాన, గుండె, తపింప జేసి
బీటలుగ పగుల, గొట్టి, నీకేమి వచ్చు
ఇంత కోపాగ్ని, లోకాల। వేమి మిగులు?॥

43. కొండలవి, పగిలి, ఇల దొర్లు। కొనుచునుండ
పగుల కుండునె, ఈగుండె। బలమువీడి
అనుచు, భీతిలి, నేనిందు। నిలచియుంటి
బలము వీడిన, బ్రతుకంత। భయమె మిగులు॥

44. ఇంతనీదయ, జూపిన। న్నేలు మన్న
ఏమి ఈ వర్ష ధార, లింతింత జేసి
మిన్ను మన్నుల, జలదాల। మేళవించి
తరులు, గిరులును భువినేల। నొరగజేతు॥

45. నింగి, చిల్లుల, జల్లెడై। పొంగి పొరలి
బ్రతుకువంతలు, వంతల। వడియగట్టి

చేరి ముంచెత్త, కలయంత॥ చెదరిపోయె
కనుల, నీరోద్భు చుండ॥ నిన్నుసుట ఎట్లు॥

46. జలదముల ఘోష, వెనుకకు॥ జనియె ననుచు
నీదు దరిజేరి, నీచెంత॥ నిలతునన్న
మంచుతెర గప్పి, దోబూచు॥ లాడెదేల?
తెరలమాటున, నేనెట్లు॥ తెప్పరిలుదు?

47. తుహిన శిఖరాల, హిమకరు॥ నిహితమందు
చేరిలోలోన, నిన్జేర॥ కోరియుండ
తుహినహ్రదముల, నన్నేల॥ ద్రోసెదమ్మ
మాయ మంచాన, మునిగి, నే॥ మనుట ఎట్లు?

48. మంచుతెర, విచ్చికొనగ ని॥ న్గాంచగోరి
పండుటాకుల, మోమెత్తి॥ వేడుకొనగ
ఆకురాల్చుచు, నీవేల॥ యాదుకొనెదు?
పండు ముదుసలు, లందు, నీ॥ పంతమేల?॥

49. పవనమది వీచె, పావన॥ పరిమళాలు
నీదు పాదాంచలాల, సు॥మ్మోదమంది
స్తంభనంబయ్యె, వాయువు॥ క్షుభిత యాచు
భృకుటి ముడి, వైచితివి బోలు॥ కుపిత మతిని॥

50. ఎప్పుడీ మ్రోడు, కి సలయా॥ ల్నింపు కొనునొ?
మధురగానాల, కోయిల॥ మసలుటెపుడొ?
విరుల గుచ్ఛాలు, యింపుల॥ విరియు టెపుడొ?
ఎప్పుడామని వచ్చునో?॥ ఎండుటెడద॥

51. పుడమి వాసంత,మున, పూవు పూయుటెపుడో?
ఎండుటెడదన, మల్లెలు పండుటెపుడో?
తెలివెలువగట్టి, జాబిల్లి తేలు టెపుడో?
చివుకు బ్రతుకున, చిరునవ్వు చిందుటెపుడో?॥

52. అమ్మయన్నను, అమ్మాయి టంచుదిశల
పిలుపు వినిపించె, విశ్రాంతి రాళమందు
నాదు పిలుపంత, అరణ్య రోదనంబు
మధురభావాలు, గగన, సు మాలెయౌన॥

53. బాధ బోధల, సుడిగాలు లందు తిరిగి
ఒక్కపరి, నింగి రెక్కల నెక్కుమందు
మరియు వేరొక్క తూరి, ఏ మరుచునేను
కోర్కె కొండల, శిరమును కొట్టుకొనుదు॥

54. తీయతీయని కలలనే తేలియాడి
అంతలో, కొండ నెక్కుదు ఆశచెంది
జీవితమునందు, కృంగి కృశించి పోయి
అంతలో క్రింద, పడుదు ని:రాశచెంది॥

55. అంబరంబున, నరుణి, మ,ౕలాడినపుడు
అరుణిమన, విచ్చి అంబుజ మలరినపుడు
నీదు వదనాంబు జంపు, శోభలె నిండెననుచ
కాంచి చూచెద, నా ఉష కాలవేళ॥

56. ఆనిశాంత, మధుర, ప్రశాంతవేళ
ముంగురుల జారి, కన్నుల ముద్దులాడు

కలలలోతుల, నినుగాంచ దలచి మురిసి
కాచుకొని చూతు, స్వప్నాంత కాలమెల్ల॥

57. శుక పికంబుల, గానవీ చికలదనిసి
ఎందుకొమ్మలె, చిగురించి నిండి యాడ
తీక్ష పాతాతపాల, వి॰శీర్ణమైన
ఎడదకుసుమింప, దాయంచు వేచియుంటి॥

58. మధుర భావాల, రాగాల మలచి కొనుచు
ఏదొచిరుగాలి, కెరటాన హృదయనాళ
మందు నన్జేరి వంశి, మ్రోయంగ చేతు
వనుచు చూతును గళము, సారించుకొనుచు॥

59. ఇట్టి గహనాంతసీమ, నన్నొంటి జేసి
అదయ వౌచు నీ వెందు,! లరగి నావు?
అయిన నేమాయె, నే నెట్టు లయినగాని
నీదుజాడల దెలియ, వెన్దీయనమ్మ॥

60. కిరణ లేశమయేని, ఈఇరుకుగుండె
కుహరమున్ జేరి, వెలుగుల గూర్చుననుచు
తలపు 'తలుపుల', నోరగా తొలగజేసి
కాచుకొని యెట్లు, లుందుదు కాలమంత?॥

61. నిన్ను విడనాడి, నేనెట్లు నిలువగలను
అరయ గావలె, నెచ్చోటు లయినగాని
మింట నింటను, పుడమి, యొల్లెడల వెదుక
జాడ బొడచూపునేమొ? చూచాయనైన॥

62. కాల మేఘాలు, క్రమ్మిన। కాళరాత్రి
నీవు దరహాస ప్రభల,న। న్నీరుదనుచు
మెరపు దీవల త్రోవల। పరవశమున
అరయుచును వెదకి, కొనెద,నా। కాశమంత॥

63. బొందు మల్లెలు, జాబిల్లి। పుడికినటుల
పచ్చకపురంబు, తూర్పార। బట్టినటుల
వింతగా హాస ప్రభల, భా।సింతువనుచు
పాల పుంతల జూతునే। పరవశమున॥

64. మావి, శాఖల చివురుల। మ్రోవి కొరికి
కూజితంబుల యిలనింపు। కోయిలమ్మ
పాట వెన్కనురోదశి। పరువులెత్త
నీదుగానాల విననౌనా। యెందునైన॥

65. మెల్లగా జేరి ముంగురు। లల్లలాడ
చెక్కిళుల నిమిరి గుసగుస। చెవుల నాడు
మంద మారుత, సతి, వస। నాంచలాన
నీదు దరిజేర, నామది। నెంచుచుంటి॥

66. దివికి భువికిని లీల, ప। ల్టీలు గొట్టు
మారుతపు రెక్క లెక్కి, ని।న్నేరుకొరకు
కలలలోకాల మధుర, భా। వాలదేలి
నేర్తుపవనంబు పయనించు। రీతులెల్ల॥

67. శీతశైలోచ్ఛ శిఖరాగ్ర ప్రాంతమందు
హిమతుషారాల, శీతల సీమలందు
మహిత మానస, సరోవర మధ్యమందు
వెదకి నీ పాదముల, చెంత కెటులొవత్తు॥

68. తళుకు బెళుకుల మింట, నాట్యాలు సలిపి
మెరపు దీవకు అందాలు నెరపు కొనుచు
పరుగు మెరపున నీలాభ్ర పటలి దాటి
ఇలకు దిగుచుందు వసునాశ మలచు కొంటి॥

69. ఈవిశాల గగనాంత సీమదాటి
ఆ వియన్నదీ, శీత, తుషార మందు
జలక మాడెనొ, తల్లి, యంచనెదు నాశ
చూచెదను, చంద్ర కిరణాల చూపునిలిపి॥

70. చంద్రలోకాల, కిరణాల జాలమందు
జోల లూగుచు, నుందు, వీ వేళయనుచు
మనసు వెన్నెల విరిసి, సన్మానమివ్వ
కోరికల రెక్క లెక్కి, చ కోరి నౌదు॥

71. శీత సితచంద్ర, చంద్రికా సీమలందు
మధుర హాసాల, మాలల మలచి కొనుచు
తారకల విశాల శాలల బారులందు
చూతు నెందేని, హసియించు చందువేమొ॥

72. మహిత మహనీయ, జాహ్నవీ। మధురవీచి
చలనమున, నిటు సం। చలనమందు
కలువరేకుల, యానంబు। సలుపుకొనుచు
కలయజూతును, మున్నేర్లు। కలియుచోటు॥

73. శిలల శాపుల, తలయొడ్డి। వెలువరిల్లి
బిలబిలన్, రవళింపు,చు।ద్వేల యోచు
కొక్కెరటాల పరువెత్తు। కొండవాగు
నమృతవార్నిధి, జేర్చు రవ్వంత దీని॥

74. కదలి వెదుకంగ, వెనుకాడి। వెదల బోను
ఏదొ మృగతృష్ణ, యనుచనే। నెంచబోను
భూరి శిఖరాల, లోయల। భూములందు
అందు నిందున, నెందైన। వెదకి కొనదె॥

75. అరయవలయును, వెరువ, నే। భారమనుచు
అణువునందున, బ్రహ్మాండ। మందునైన
విశ్వరాశుల వడబోసి। వెదకిచూతు
నిలువగా లేను, సుంతైన। నిన్ను వీడి॥

76. నీవు నాయింట నడయాడి। నెనరు జూపి
నాదుదరి జేరి, కన్నుల। నరయవేని
ఇలను మింటిని, అణువణువు। విచ్చిజూచి
అరసెదను నిన్ను, కాలాంత। మయినగాని॥

77. నాగుమాగుమ, యన్ననే। నాగబోను
ఖేద మింతయులేదు, యే।బాధలేదు

నిన్ను కనబోవు, చున్న నాకేల భయము
చంచలముగాదు, నా మనోనిశ్చయంబు॥

78. బదలికే లేదు, చావన్న భయములేదు
నాదు మది నిన్ను, నిలుపుకొన్నంతవరకు
మృత్యువే వచ్చి, చెయి, వేయ దాయునేని
కాలుమెదబట్టి, నీదుపా దాలవైతు॥

79. ఎదురు చూచుచు, నుంటి, నీ విందుజేరి
తనయుడా రమ్మటంచు, నీ వందు వనుచు
రాకయున్నను, హృదయపున్ రెక్కలెక్కి
ఎగిరి నీపాదముల, చెంత కెటలొవత్తు॥

80. పటిమతో తిమిర, సంఘాల దాటికొనుచు
దూతయై వచ్చె, కాబోలు వింత తళుకు
ఏమిశుభవార్త, తల్ల పంపించెనేమొ?
నుంత విని సంతసింతు,నా వింతయేమొ?॥

81. మింటి గ్రప్పిన, నీలిమల్ విడెదు వేళ
మేఘపున్, తెరల మాటున మిణుకు మనుచు
రెప్పలాడించి, ఒకచుక్క విప్పి చెప్పె
తల్లి సందేశమొక, వింత వాలకమున॥

82. ఎన్నొ ఊహల, కాహళుల్ వెలుగుజేసి
వెదికితినిగాని, ఈ విశ్వ వీధులందు
వింత నీమనో, యవనికా భ్యంతరాన
నవ్వుకొనుచున్న, నన్నీవు అరయవనుచు॥

83. వినుచు సందేశ, మొక్కింత। విస్మయమున
చూపు నాలోన, మలచినే। చూచినంత
అంతరంగాన, వెలుగు రవ్వంత వెలిగి
చల్లవెన్నెల, విరిబూసి। జల్లుమనియె॥

84. నీదు మకుటాన, జాబిల్లి। నిలచి యాడి
శారదా జ్యోత్స్న, దశదిశల్। బరపుకొనుచు
తెల్ల జండాల, నూపుచు। తెలియజేసె
నీదు ఉనికిని, తెలిపెడు। నిజపువార్త॥

85. ఎరుగుదును, ఎవరొ కరముగీ। లించి రనుచు
ఎరుగుదును, ఎవరొ తెరచాప। నెత్తిరనుచు
ఎరుగుదును, నౌక, కదలిన। తేలెననుచు
ఎరుగుదును, నావతీరాన। జేరెననుచు॥

86. ఎరుగుదును, లోన హరివిల్లు। విరిసెననుచు
ఎరుగుదును, మేన విరివాన। కురిసెననుచు
ఎరుగుదును, చిన్న చినుకొకటి। ఇందుజేరి
మంచి ముత్యంబుగా, నన్ను। మలచుననుచు॥

87. ఉదయభానుని రాగ, సంపదల దాల్చి
అరుణిమల్ నిండి, నాయందు। అలముకొనెడి
అంబుజంబుల, నీదు రూపంబు నిలిపి
మనసుకోవెల, నిన్ను నే। మలచు కొనెదు॥

88. రంజితంబౌదు, కాళ్లపారాణి యౌచు
రాగమున దేవి కుసుమ, పరాగ మౌదు

సుమముగా వేణి కుసుమింతు। సోయగముగ
గళమునన్ పరిమళింతు, సు।గంధ మౌచు॥

89. నీదుపదపీఠి ఆకాశ। వేదియందు
నటన మొనరింప, సన్నద్ధ। మైతి నమ్మ
నీదు నటనాల, నే లయ। మందువరకు
భరత భంగిమ నుందు, నీ। పరిధియందు॥

90. మానసంబున, విననయ్యె। గాన ఫణితు
లేవియో, దివ్యరాగాల। దేలియాడి
ఆలపించెద, నుదువీధి। మెట్లపైన
పంచమశృతి, చంద్ర వి।పంచి మీటి॥

91. తేనె వాకల, లోననే। తేలినటుల
దివ్య సుమములు, హృదయాన। తివిరినటుల
మలయ చందన, మింతమై। నలదినటుల
దివ్య సూక్తుల, భావాలు। తేటయయ్యె॥

92. ఎవరొ కదలించి, పూరించి। విడిచినారు
వేణుగళమున, ప్రశాంత। ఫణితులెన్నొ
మధురభావాల, రాగాల। మలచి కొనుచు
మాలలల్లెద, గాన సు।మాల నెన్నొ।

93. తేనె వాకల, లోనను। తేజమంది
అలల ముంచెత్తి, మేథాంబ। రాననెగసి
మేలుగా, లోని భావాల। జాలువారు
తేనె, సోనల, రాగాల। తేలుచుందు॥

94. కనుల నీరూపు, నిండిన। క్షణములందు
వేదసారము, లెన్నియో। విదిత మౌచు
నాదు హృదయాన, నదియించి। మేదురముగ
కరగి, గంగా ఝరిని, దేలె। కావ్యరీతి॥

95. లోన జూచితి, ఆకృపా। లోకనములు
రవళి విననయ్యె, భావనా। రమ్యసీమ
గాత్రమున సాగె, నేవియో। గాన ఝరులు
గాన ఝరి జేరె, భావార్ద్ర వాన కలిసి॥

96. కురిసె, నాప్రాంగణమ్మున। విరులవాన
చవులు దేరెను, హృదయాన। పూవు దేనె
మందమారుత, మాత్మ స। మ్మోదమిచ్చె
అరుణరాగము, పండినా। అంతరాత్మ॥

97. నీవె ఈ వీణ, శృతి గలిపి। నింపినావు
స్పందనంబుల, నాలోన। మందగతిని
రవళి నింపుచు, నదియించి। భువినిమించి
ఆకసంబున, నా, మనో। లయముగాంచె॥

98. ఎదదలోపలి, యెద, ప్రకంపించె నేమొ?
ఏదొ అస్పష్ట, సంచలన। మిందురేగి
స్పందనలలోని, భావాల। సారమెల్ల
స్మృతుల, వెలయింతునీదు, స। న్నుతుల నెన్నొ॥

99. జ్వలన మందె, నిరంతర। జ్వాలయేదొ
కాంతి ఛటలోని ఆకాశ। మధిగమించి

అంతరాంతర, తిమిరాల। నణచివైచి
పవలు రేలును నేక, రూ।పాన వెలిగె॥

100. దివ్యమణి ఖండలాఖండ। దీప్తిమాన
శీత, సిత, చంద్రికా దివ్య। శ్రీచెలంగు
కాంతి యేదియొ, అణువణువు। ఆక్రమించి
మానసాకాశమది, దీప్తి। మంతమయ్యె॥

101. విశ్వవీణా గళమ్మున। వినగనయ్యె
వేదముల, సారమోంకార। మెదదనిండె
విశ్వవీణా గళోద్భవ। వీచితోడ
ఆత్మరాగము శృతి గలసి। ఆవహించె॥

102. క్షణము జరిగిన, మరియొక్క క్షణము జేరి
కాలవాహిని హద్దులు। కరగి కలసె
పలుకు లింకిన, మానస। భావవీచి
భావరూపిణి, యాపరా। వాక్కు గలసె॥

103. దివ్యతేజో విలక్షణ। దీప్తియేమొ।
పటు, మహోభీలతిమిరాంధ। పటలియేమొ
కాదు, అవునని, తెలియని। కాలమంత
లయము చెందెను, ఆ మహా।లయమునందు॥

104. లయమునందున, సౌందర్య లహరి యొకటి
రంజితంబౌచు, హృదయాంత। రాళమందు
మేదురంబయి, రాగ, స।మ్మోదమంది
లాస్యమొనరించె, ఆనంద। లహరి యగుచు॥

105. ఆ మహోలాస్య, విన్యాస। మలరుచుండ
రంజితంబయ్యె, నా, ఉషో।రాగరేఖ
ఆ సుధాలాస్య, శ్రీయందు। మోసులెత్తి
ఊర్జితంబయ్యె, చంద్ర, మ। యూఖరేఖ॥

106. పారిజాత, పరిమళ। భాగ్యపటలి
ఏదా భవ్య, వాద్య స్వన। నిక్వణంబు
దివ్యతేజః ప్రభాపుంజ। దీప్తియేదా
నాదు మదిలోన, లీనమై। నటులదోచె॥

107. ఏదా తేజో విలాస, మీ। ఎడదనిండి
అణువణువు గ్రమ్మి, ఆకాశ। మధిగమించి
వ్యాప్తమయ్యెను, నాబహి। రంతరముల
తనువు, నీరాజనంబయ్యె। తల్లి గనుమ॥

108. లలిత పద పద్మ నిష్యంది। అమృతశీక
రాఱ, లౌచును, లోన, నే। నిన్ను కనుచు
దివ్య నఖ, చంద్రఖండాల। దీప్తులంది
చరణ కాంతుల, నేనొక్క కిరణమైతి॥

శ్రీ

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ



# రచయిత పరిచయం

రచయిత : శ్రీరామకృష్ణ భరద్వాజ
(కీ॥శే॥ వరఘ శ్రీ రామకృష్ణమూర్తిగారు)

జననం : 17.04.1918. శ్రీకాళయుక్తి నామ సంవత్సర.
చైత్ర శుద్ధ సప్తమి, బుధవారం.
పునర్వసు నక్షత్రం. శ్రీరామనవమి నాడు.

పుట్టినవూరు : వల్లెకోన గ్రామం. రేపల్లె తాలూకా. గుంటూరుజిల్లా

జన్మనిచ్చిన తల్లిదండ్రులు : కీ॥శే॥ వరఘ మహాలక్ష్మమ్మగారు,
కీ॥శే॥ వరఘ సుబ్బారావుగారు.

సహధర్మచారిణి : కీ॥శే॥ వరఘ (కస్తూరి) నాగపూర్ణాంబ
కనగాల గ్రామం. రేపల్లె తాలూకా. గుంటూరుజిల్లా

ఆమెకు జన్మనిచ్చిన : కీ॥శే॥ కస్తూరి రాజ్యలక్ష్మమ్మ గారు.
తల్లిదండ్రులు కీ॥శే॥ కస్తూరి వెంకట సుబ్బయ్య గారు.

కీ॥శే॥ వరఘ శ్రీరామకృష్ణమూర్తిగారు 1943 నుండి 1947వ సంవత్సరము వరకు రాయల్ ఇండియన్ ఆర్మీ సర్వీసు కోర్. రెండవ ప్రపంచయుద్ధంలో పనిచేసి. స్వయం ప్రతిభతో హిందీ, సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల సాహిత్యములను విశేషముగా అధ్యయనము చేసారు. అలనాటి కీ॥శే॥ కాసా సుబ్బారావుగారి 'స్వతంత్ర' లో 'రామకృష్ణ' పేరుతో రచనలు చేసారు. 1986 ఆగస్టులో ఋషిపంచమినాడు స్వర్గస్థులైనారు.

కీ॥శే॥ వరఘ (కస్తూరి) నాగపూర్ణాంబగారు పరమ సాధ్వి. శ్రీకనకదుర్గమ్మ తల్లి సమీపాన 1976వ సం॥లో ఆతల్లిలోనే ఐక్యమైపోయిన పరమపావని.

రచయిత యితర రచనలు : రెండు సత్యసాయి శతకములు (ముద్రితం)
సౌందర్యలహరి శతకం.
సకల కల్యాణి శతకం. ఆనందలహరి శతకం